# చతుర

## నవలా స్రవంతి...



ప్రామాణికమైన ఉత్తమ నవలలకు వేదికగా ప్రసిద్ధి పొందిన 'చతుర' అనతి కాలంలోనే అసంఖ్యాక పాఠకులను ఆకట్టుకుని సుస్థిర స్థానం సాధించుకుంది.

'చతుర' ప్రచురించే నవలలలోని వైవిధ్యం, సమగ్రత ఇందుకు ప్రధాన కారణం. సెప్టెంబర్ సంచికలో చతుర సమర్పిస్తున్న నవల, కవి హృదయం నుండి జాలువారిన వచన కావ్యం వంటిది.



132 పేజీలు
125 పైసలే
ప్రతి నెలా
ఒకటవ తేదీకి
వెలువడే
నవ నవలా వేదిక చతుర

ఒక
జీవిత
సత్యానికి,
భావోద్వేగంతో
నందూరి రామకృష్ణ
లేఖిని నుండి రూపు దాల్చిన
'ప్రేమాగ్ని' చదివి చూడండి.

చతుర

Marketed By
Margadarsi Marketing
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

24674




# రికరి®
# ఇన్‌స్టెంట్




ఇది ఫిల్టర్
కాఫీ వలెనే యెంతో
రుచిగా ఉంటుంది కాబట్టి
తేడాచెప్పడం చాలాకష్టం.

నెస్ కపె ఉత్పత్తిదార్లనుండి-ప్రపంచమంతటా కాఫీ శ్రేష్ఠత తెలిసినవారు

SAA/FSL/R/113





# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938—1972]

శుక్రవారం : 7-9 '79

సిద్ధార్థినామ సం. భాద్రపద ఐ. పాడ్యమి

**సంపుటము 73 : సంచిక 2**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# మిరమిట్లు గొల్పే తెలుపు
# చూడగానే
# అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక

**డెట్**

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78

సీరియల్

# ప్రేమపాశం

శ్రీమతి ప్రమీలాజనార్దన్

జంట నగరాల పరిసర గ్రామాలలో అంటు వ్యాధులు, విషజ్వరాలు తీవ్రరూపం దాల్చినప్పుడు ప్రభుత్వాదేశాన్ననుసరించి డాక్టర్ల బృందాలనేకం బైలుదేరాయి.

మనోహర్ నాయకత్వాన బైలుదేరే బృందంలో డాక్టర్ శాంతి కూడా వుంది.

"మీకిలా వచ్చేందుకు యేమైనా ఇబ్బందౌతే చెప్పండి. సూపరింటెండెంట్‌తో చెప్తాను.' బైలుదేరే ముందురోజు హాస్పిటల్లో క్యాజువాలిటీ దగ్గర కలుసుకున్నప్పుడు ఆమెతో అన్నాడు మనోహర్.

"యేం, నా రాక మీ కభ్యంతరమా?" నడుస్తూనే సూటిగా ప్రశ్నించిన ఆమె ప్రశ్నకు వెంటనే జవాబివ్వ లేకపోయాడు.

"అబ్బె నాకెందు కభ్యంతరం?" తడబడుతూ అన్నాడు.

"నన్నిలా అడిగారంటే మరేం అనుకోమంటారు?"

"అదికాదండి..." ఆమె దిశ చూసిన అతడి చూపులతో ఆమె చూపులు కలుసుకోగానే ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు.

"నేను రావడం మీ కిష్టం లేకపోతే చెప్పండి. తప్పకుండా మానేస్తాను." అంది బాధ ధ్వనించే గొంతుకతో.

"అబ్బెబ్బె నేనావుద్దేశ్యంతో అనలేదు. అపార్థం చేసుకోకండి మీరు మామూలుగా యెక్కడికీ..." అతడి మాటల మధ్యలోనే విరక్తిగా నవ్వింది.

"ఇన్నాళ్ళు భ్రమలో వున్నానన్న నిజం తెలుసుకున్నప్పటి నుండి నాకు బాధ తాపత్రయాలు లేవు."

"చిత్రంగా మాట్లాడుతున్నారు."

"చేదు అనుభవాలై చెప్పేటప్పుడు వినేటప్పుడు చిత్రంగానే వుంటాయి." అని క్షణమాగి "మీరు నా గురించి ఇంత శ్రద్ధగా ఆలోచిస్తున్నందుకు థాంక్స్. నాకిలా సేవ చేసే అవకాశం లభించినందుకు

*(గత సంచిక తరువాయి)*

చాలా సంతోషంగా వుంది." అని అక్కడి నుండి వెళ్ళిపోయిన శాంతి మాటలు అతడి హృదయాన్ని కల్లోలపరిచాయి.

తన గురించి ఆమె యేమనుకుంటున్నది? తను ఆమె రాక కయిష్టపడుతున్నట్లు మాట్లాడాడా? అయినా ఆమె గురించి తనకెందుకింత ఆలోచన?

"మీరు నా గురించి ఇంత శ్రద్ధగా ఆలోచిస్తున్నందుకు థాంక్స్" అన్న ఆమె మాటలు తలుచుకుంటే యేదోలా వుంది.

'ఛీఛీ అనవసరంగా వాగి ఆమె దృష్టిలో చులకనయ్యాడు.'

ఆమె మామూలుగా మీటింగులకు గాని, పిక్నిక్‌లకు గాని రానని ఖచ్చితంగా చెబుతుంది. తన వాళ్ళు తనింట్లో ఒక్కరోజు లేకపోయినా యెంతో నష్టపడతారన్నట్లు మాట్లాడుతుంది. తన తోబుట్టువులందర్నీ వృద్ధిలోకి తీసుకొని రావాలని ఆమె ఆరాటం.

"మరీ ఇంత సిన్సియార్టీనా?" అని యెవరైనా అంటే—

"చెయ్యాలనుకున్న దాన్ని చెయ్యడంలో ఆనందం లభ్యమౌతుంది. యేదో త్యాగం చేస్తున్నానన్న భావన నాకు లేదు. అయినా నా వాళ్ళకు నేను చేసుకోడం గొప్ప విషయం కాదు" అంటుంది.

దాదాపు ఆ హాస్పిటల్లో డాక్టర్లందరికీ ఆమె విషయం తెలుసు. అసలు యే ఇద్దరు

**జరిగినకథ 1:** లోటి డాకర్ను, కొడుకు విజయ్‌బలవంతముచేయగా భార్య జానకికి ఆపరేషన్ చేసి ఆమెను కాపాడిన డాక్టర్ మనోహర్‌కు డాక్టర్ శాంతి వల్ల మారిన తన వైవాహిక జీవితం గుర్తుకొస్తుంది.

కలుసుకున్నా ఆమె గురించి ఒకటి రెండు మాటలైనా కదులుతాయి.

ఆమె గురించి తెలిసిన మనోహర్‌కు ఆమె అంటే గౌరవం ఇనుమడించింది. "యెందరామెలా వుంటారు?' అనుకున్నాడు చాలాసార్లు.

తమిద్దరి కంత సన్నిహిత పరిచయం లేనందున తనతో రానని చెప్పలేక పోతున్నదేమోనని భావించి అలా అన్నాడు గాని మరే వుద్దేశ్యంతో కాదు. ఆమె అలా మాట్లాడిందంటే బాధగా వుంది.

'తనలా అడగకుండా వుండాల్సింది' అని అప్పటికే పదిసార్లనుకున్నదాన్ని పడుకొనే ముందు మరోసారనుకున్న మనోహర్‌కు శాంతి మనసు తెలియదు. ఆమె పరిస్థితి తెలియదు. ఆ గుండెలో గూడు కట్టుకున్న భావాలు గాని, ఆమె ననుభవిస్తున్న భయంకరమైన మానసిక ఒంటరి తనం గురించిగాని అసలే తెలియదు.

"డాక్టర్ ఈరోజు నాకెంత ఆనందంగా వుందో తెలుసా?" నిద్ర పట్టక పిచ్చివాళ్ళలా తిరగేస్తున్న శాంతి కండ్ల ముందు మనోహర్ రూపమే గోచరిస్తున్నది.

"యే సంబంధం లేని మీరు నా గురించి ఇంతగా ఆలోచించారంటే నాకు మహా సంతోషంగా వుంది. 'నా' అనుకున్న వాళ్ళు నన్ను యంత్రంగా తప్ప, మనిషిగా అనుకోడం లేదని తెలిసి నప్పుడు నా గుండె పగిలిపోయింది డాక్టర్. నా మనసు చచ్చింది. అసలు నేనే చచ్చివుంటే!

నా జీవితం నావారి ఉన్నతికి పునాది కావాలని అనుకున్నాను గాని, వాళ్ళ అవహేళనలకు గురౌతాననుకోలేదు. వాళ్ళ అవసరాలకు యంత్రంగా మాత్రమే వుపయోగపడాలనుకోలేదు. వాళ్ళ అభిమానం జీవితాంతంవరకుండాలని...కాదు. వుంటుందని తృప్తిగా బ్రతకొచ్చునని అనుకున్నాను. కాని...కాని... నా ఆశ అడియాస అని తెలుసుకున్న నేను నా బాధ యెవరితో చెప్పుకోను?" ప్రక్క గదిలో నుండి వినిపిస్తున్న మాటలు, నవ్వులు విని విరక్తిగా నవ్వుకుంది.

'ఆ నవ్వుల్లో తన నవ్వు కలిపేది కొద్ది రోజుల క్రితంవరకు ఆ మాటలలో తన మాటలు వినిపించేవి. విష్కల్మషంగా నవ్వింది మాట్లాడింది. యెదుటి వారి

మనసులు గూడా తన మనసులాగే వున్నాయనుకుంది. కల్మషం నిండిన మనసులను చూడలేకపోయింది.' ఏడుపు ముంచుకొచ్చింది. చేతిలో పుస్తకాన్ని నేలమీదికి విసిరింది.

తనంటే ఇంట్లో అందరికీ అభిమానంతో గూడిన భయభక్తులున్నాయని తలపోసిన ఆ రోజులు తలుచుకుంటే తన మీద తనకే జాలి గలుగుతుంది

"అక్కా, ఎక్స్‌కర్షన్‌కు వెళ్ళాలి. వంద రూపాయలు కావాలి" అని తమ్ముడు కిరణ్ అడిగినప్పుడు "అంత డబ్బు పెట్టి వెళ్ళకపోతేనేం ? దాని సంపాదన మీ పిక్నిక్‌లకు,






పార్టీలకా ?" అన్న తల్లిలో ఈనాడెంత మార్పు !

"వెళ్ళనివ్వమ్మా. అలా నలుగుర్లో కలిసి తిరిగితేనే మంచి చెడులను తెలుసుకుంటారు. పుస్తకాలు చదివి సంపాదించే జ్ఞానానికి తోడు ప్రపంచ జ్ఞానం తోడైతే హాయిగా బ్రతకొచ్చు. ఈరోజు డబ్బుకు చూసుకుంటే వాడి కిప్పటి నుండి ప్రారంభ మధ్యే నిరుత్సాహం, నిస్పృహా వెంట వెంట ముందు బతుకు నుత్సాహవంతంగా వుంచవు" అప్పుడు తనన్న మాటల ఫలితం ఇప్పుడు కనిపిస్తున్నది.

ఎం. ఏ. ముగించబోతున్న కిరణ్, బి. ఏ. ముగించబోతున్న పెద్దచెల్లెలు మాధవి, బి. ఏ. మొదటి సంవత్సరం దాటిన చిన్న చెల్లెలు రాధిక, ప్రపంచ జ్ఞానం బాగానే సంపాదించారు.

# ప్రేమ పాశం

"ఆవకాయానికివాడుకొని పారేసే వస్తువు" లా భావిస్తున్నారు తనను.

శాంతి చదువు పూర్తయిన సంవత్సరమే తండ్రి చనిపోయాడు. ఆ తర్వాత అదృష్టం కొద్దీ నెలలోనే గవర్నమెంట్ డాక్టరయింది.

ఒడ్డుకు చేరిన శాంతి, తమ్ముడి చెల్లెళ్ల జీవితాలను తీర్చిదిద్దాలనుకున్నది.

తన తర్వాత ఇద్దరు పిల్లలు పుట్టి పోయాక కిరణ్ జన్మించినందున తండ్రి మరణం నాటికి అతడు కాలేజి మొదటి మెట్టుమీదే వున్నాడు

మాధవి, రాధిక హైస్కూల్లో చదువుతున్నారు.

ఆ లేచిగుళ్లను వృద్ధిలోకి తేవడం తన బాధ్యత అనుకున్నది. వాళ్ల గురించి, వాళ్ల భవిష్యత్తును గురించి బోలెడు కలలు గన్నది.

కిరణ్ బి. ఏ. కాగానే వుద్యోగం చేస్తానంటాడేమో ననుకుంది. అతడలా అన్నా తను చెయ్యనివ్వ దలుచుకోలేదు. కాని అతడలా అననందుకు, మాట మాత్రంగానైనా తల్లి ఆ ప్రసక్తి యెత్తనందుకు ఆశ్చర్యపడింది.

"వాడు ఎమ్. ఏ. చదివి ఐ. ఏ. ఎస్.కు పోతాడట." మాటల సందర్భంలో చెప్పింది తల్లి.

"నా వుద్దేశ్యం కూడా వాడు గొప్ప ఉద్యోగస్థుడవ్వాలనే నమ్మా. దేవుడి దయ వల్ల డబ్బుకు గూడా ఇబ్బంది లేదు" అంది మనస్ఫూర్తిగా. ఇంటి దగ్గర ప్రాక్టీసు బాగుండడం వల్ల డబ్బు విషయమై ఆలోచించాల్సిన అవసరం లేదు.

మాధవి, రాధిక కాలేజీకి వచ్చారు. తన యెదుట అధికంగా మాట్లాడని వాళ్లను తనే పలకరిస్తుంది.

తను హాస్పిటల్ నుంచి వచ్చేటప్పటికి పెట్టి వుండే రేడియోను, తన అడుగుల శబ్దం వినగానే ఆపేస్తారు.

"ఈ సమయంలో పాటలు, సినిమాలు అంటూ వెర్రి వ్యామోహంలో పడితే, ముమ్ముందు తీరిగ్గా విచారించే రోజులొస్తాయి." అని తను హెచ్చరిస్తుండడం వల్ల తనముందు భయంగా మసులుతారు. ఆ భయభక్తుల వల్ల వారు వారి జీవితాలను సుఖప్రదం చేసుకుంటారనుకున్నది గాని, రెక్కలు రాగానే యెగిరిపోయే గువ్వల్లా చెయ్యాలనుకుంటున్నారని అనుకోలేదు. అందరిలాగే తనను బండరాయిగా కోర్కెలు ఆశలులేని జడపదార్థమని అనుకుంటున్నారని తెలుసుకోలేదు. వారి అభిప్రాయాలను ఆదిలోనే త్రుంచెయ్యాల్సిన తల్లి, వారిని సమర్థిస్తుందని ఎప్పుడూ అనుకోలేదు.

ఆ రోజు...

శాంతి హాస్పిటల్లో పని లేదని తొందరగా ఇంటికి వచ్చింది. "రాకుండా వుంటే ఇంత మనస్తాపం వుండేది కాదు." అని ఒకసారనిపిస్తే 'రాకపోతే ఆ భ్రమలో కాలమంతా గడిచి., ఇక చెయ్యాల్సినదేమీ లేని తరుణంలో శిల్పిన రూపంలా మిగలాల్సి వచ్చేది' అనిపిస్తుంది మరోసారి.

"నిన్ను తప్పకుండా కాలేజీల చేరమంటుంది అక్క" అని కిరణ్ సీరియస్‌గా అంటే "చేరనని ఖచ్చితంగా చెప్పాను." కోపమంతా మాటల్లోనే ఇమిడ్చి అంది మాధవి.

"దానిలా పెండ్లి పెటాకులూ లేకుండా వుండాలని దాని వుద్దేశ్యమేమో! చెప్పించిన చదువు చాలని, మూడుముళ్లూ వేయించి నిన్నో ఇంటిదాన్ని చెయ్యమని చెప్పాను." అన్న తల్లి మాటలు, ఆ చెంపా ఈ చెంపా వాయించినట్లనిపించాయి.

"అంతేకాదు తనలా రాయిలా యెవ్వరూ వుండరని కూడా ఆవిడగారితో చెప్పమ్మా" అన్న కిరణ్ మాటలు తల తిరిగేలా చేస్తే "మనమో దారిన పడేవరకు ఆవిడగారి అధికారానికి తల వంచాల్సిందే." అన్న రాధిక మాటలు నిరుత్తరాలిని చేశాయి.

ఆరోజు ప్రొద్దునే తను హాస్పిటల్‌కు వెళుతున్నప్పుడు "అక్కా. నా ఫ్రెండ్ అమెరికన్ జార్జెట్ చీర కొనుక్కున్నది. చాలా బాగుంది. నేనూ కొనుక్కుంటాను." అని రాధిక అడిగితే "యెవరేదికొనుక్కున్నా కావాలనుకోడం కాదు. కాస్త చదువు మీదికి మళ్లించు మనసును" అని నూట యాభై రూపాయలు ఇచ్చింది. ఉప్పటి నుండి ఆ పిల్లకు అలంకరణల మీద యెక్కువ ఆసక్తి. ఆ మాత్రం తను సందర్శించ గూడదా? అది అధికారం ప్రదర్శించడ మౌతుందా?

వాళ్లగురించి నిరంతరం ఆలోచించే తనను వాళ్ళర్థం చేసుకున్న దింతేనా? వారి మాటల కడ్డు చెప్పలేదంటే తల్లి గూడా వాళ్ళతో యేకీభవించినట్లేగా.

మిగతా పిల్లల గురించి ఆలోచిస్తున్నట్లుగా తన గురించి అనుకోడం లేదంటే తను వాళ్ల అవసరాలు తీర్చేందుకుండాలన్న భావనే గదూ! గుండెలో మంటలు రేగాయి.

తనెంతో అభిమానంతో తన గురించి ఆలోచన మానేసి, వాళ్ళ అభివృద్ధిని కాంక్షిస్తుంటే వాళ్ళనుకుంటున్న దేమిటి?

తండ్రి పోయిన క్రొత్తలో తన పెండ్లి చెయ్యాలని దిగులు పడేది తల్లి.






ఉపయోగించుటకు ముందు ★ ఉపయోగించిన తర్వాత ★ ఉపయోగించుటకు ముందు

## అనారోగ్యులు అభాగ్యులు

మీకు విశాలమైన ఛాతి, దృఢమైన శరీరం, మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే 'జీవన్‌టోన్' ఉపయోగించుట మంచిది. మీరు ఒక పౌండు జీవన్‌టోన్ వాడినారంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్లయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే.... జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి 'జీవన్‌టోన్'. మీకు తగినంత ఆరోగ్యం, దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి.

కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశిష్టమైన మూలికలను చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు.

స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద సీసాలు అన్నిచోట్ల సులభంగా లభించగలవు. (వ్యాయామం అవసరంలేదు.) ఒకవేళ ధూమపానము అలవాటు వున్నట్లయితే కొనసాగించవచ్చు. వెల : **454** గ్రాములు (1 పౌండు రు. **18/-**)

సెల్‌టాయిల్ మరియు సెల్బో పౌడర్ : వయసుకు వచ్చినవారికి మాత్రమే వెల : రు. **24-00** (ఉభయులకు)

స్కిన్ పీక్సు : మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా మంచును. వెల : రు. **20-00**

క్రింది చోట్లయందు లభించగలవు : వరంగల్ : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు. ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేద ఇన్‌గ్రిడియన్స్, ఎమ్. వి. రోడ్డు. మచిలీపట్నం : ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజెన్సీస్, తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్. హైదరాబాద్ : ఆయుర్వేద్ మెడికల్‌హాల్, కోఠి, బస్‌స్టాండు ఎదుట, సంపత్ & కం., పంజగుట్ట, జైరాం మెడికల్స్, కోటి, ట్యాంక్ రోడ్డు, వసంత్ మెడికల్‌స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్‌హాల్, క్లాక్ టవర్ ఎదుట, విష్ణుమెడికల్ హాల్, గుల్జార్‌హౌస్. ఇచ్ఛాపురం : జనతా మెడికల్‌స్టోర్స్. పర్లాకిమిడి : సి. ధర్మనారాయణమూర్తి & సన్స్. బొబ్బిలి : తంగుడు నారాయణమూర్తి. పెద్దపల్లి : టి. ఎస్. ఎస్. మూర్తి. పార్వతీపురం : పద్మిని మెడికల్ స్టోర్స్. పాలకొండ : సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం : బిల్లాని సత్యనారాయణ అండ్ సన్స్, పాలకొండ స్ట్రీట్. విజయనగరం : బట్నాల లింగప్రసాదరావ్ మెయిన్‌రోడ్డు. విశాఖపట్నం : సిటిస్ & కం., ఎ.వి. ఎన్. కాలేజి రోడ్డు, డా. జె.వి. శాస్త్రి, సూర్యాబాగ్ జంక్షన్. రాజమండ్రి : ఈశ్వరదాస్ & కం., జైహింద్ బిల్డింగ్. ఏలూరు : ఆంజనేయ మెడికల్స్, పవర్‌పేట. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. విజయవాడ : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పెద్దరోడ్డు. అవనిగడ్డ : కాసుమంచి అప్పలరాజు. నరసరావుపేట : హయగ్రీవ షాప్, 10-75 మెయిన్‌స్ట్రీట్. నెల్లూరు : కె. ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట : కమర్షియల్ నర్సరీ, నిజాం— 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట. సికింద్రాబాద్ : జ్యోతిమెడికల్‌హాల్ 28, ఎమ్. జి. రోడ్డు, డి. జె. ఏకడ్ & కంపెనీ, మహాత్మారోడ్డు. జనార్ధన్, శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. రావెల : డా. మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద ఆలయం. రాపల్లె : [illegible] మెడికల్ అండ్ జనరల్ ఏజెన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం : కల్యాణరావు ఆయుర్వేద వైద్యశాల, మామిడివారిస్ట్రీట్, పోవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు : సుబశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్. తిరుపతి : తారిగొండ మెడికల్స్, 247-బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి. సోమశేఖరశాస్త్రి, మునిసిపల్‌కులోని. రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్ రోడ్డు. అనంతపురం : కో—ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిడ్, రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల : శ్యామల మెడికల్ స్టోర్స్, మెయిన్‌బజార్. హిందూపురం : కె. ఆర్. భాస్కరయ్య & సన్స్ మెయిన్ బజార్. బాలాజీ మెడికల్ సెంటర్, మెయిన్‌బజార్. ఆదోని : కమలాపుర్ గోవిందశెట్టి, ఆర్. ఎమ్. సి. కమలాపుర్ నాగయ్యశెట్టి & సన్స్. కొత్తగూడెం : వరేంద్రుల శంకరయ్య & సన్స్. ధర్మవరం : శ్రీ వంజాండేశ్వర మెడికల్‌స్టోర్స్, మెయిన్‌బజార్. గుంతకల్లు : గోపాల్ మెడికల్‌స్టోర్స్. జంగారెడ్డిగూడెం : జేడి వెంకటరావ్. రాయదుర్గం : శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మెయిన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్, హిందుపురం పోస్ట్. కర్నూలు : శ్రీ రామకృష్ణ మెడికల్‌హాల్, 52/19 బాప్టియన్‌రోడ్డు. గుత్తి : డి. ఆర్. రాజాశెట్టి & సన్స్, మెయిన్ బజార్. సామిడి : ఎస్. పి. చిన్నప్పశెట్టి. కడప-1 : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మనిరావ్‌స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. అన్ని మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.

అత్యధిక విక్రయందార్లు : మెసర్స్. బాలాజి కెమికల్ వర్క్స్, ఎ. పి. ఐ. ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాద్—37. ఫోన్ : 269490.

పై పేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించనట్లయితే దయచేసి రు. 5—00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

**మెసర్స్ : జీవన్‌టోన్ (ప్రోడక్ట్స్), 17/1, కేంబ్రిడ్జి రోడ్డు, అలసూరు. బెంగుళూరు 560 008**

# ప్రేమ పాశం

"కిరణ్ కాస్త ప్రయోజకుడైతే నీకు పెండ్లి చేసేస్తాను." కొండంత బరువు నెత్తిమీద వున్నట్లు మాట్లాడిన తల్లి, కిరణ్ గ్రాడ్యుయేట్ అయిననాడు ఆ మాట అనలేదు. ఇప్పుడూ అనడంలేదు. అంటే... అంటే...తను పరాయిదైతే వీళ్ల అవసరాలు తీరవనేగా.

సంపాదించి పెట్టేందుకు డబ్బు, మంచి చెడుల గురించి చెప్పేహక్కు తనకు లేదా? ఆ హక్కు, బాధ్యత లేదనుకొనే వాళ్లకు తన ఆర్జనను అనుభవించే హక్కు గూడా వుండగూడదు.

వాళ్లు హాయిగా వుండగూడదని అనుకోడం లేదు. తనలా అనుకున్నట్లయితే తనే నాడో తన దారిన తను వెళ్లిపోయి, భర్త, పిల్లలతో జీవనం సాగిస్తూ జడపదార్థం, రాయి, బండ అని వీరందరికీ అనిపించు కొనేది కాదు. తను వాళ్లకోసం త్యాగం చేస్తున్నానని యెప్పుడూ అనుకోలేదు. కాని వీళ్ల అంతర్యాలు అవగతం అయ్యాక, అవివేకంతో తనెంతో నష్ట పోయిందని అనిపిస్తోంది. తను వాళ్ల నుండి ఆశించిన అభిమానం, ఆదరణ ఇప్పుడు ఇకముందు గూడా శూన్యమని తేటతెల్లంకాగా మనసు బాధకు లోనయింది. యాంత్రికంగా అడుగులు ముందుకు పడడం, వారి మాటలు ఆగిపోవడం జరిగింది.

"అప్పుడే వచ్చావేం అక్కా? ఒంట్లో బాగాలేదా? అరె, యేమిటలా వున్నావు?" మాధవి అంటుంటే పేలవంగా నవ్వింది. 'పైపైకి వెలిబుచ్చే ఈ అభిమానం నిజమైన అభిమాన మనుకున్నది ఇన్నాళ్లూ' వాళ్లు పలకరిస్తుంటేనే ఒంటిమీద తేళ్లు, జెర్రులు ప్రాకినట్లనిపిస్తున్నది.

తల్లి తెచ్చిచ్చిన కాఫీని మందులా తాగి తన గదిలోకి వెళ్లి పడుకుంది. తనకంటూ యెవరూ లేరన్న బాధ మొదటిసారిగా గలిగి కుమిలిపోయింది.

"రేపు మా ఫ్రెండ్‌తో పాటు హాలిడేస్ ఎంజాయ్ చేసేందుకు మద్రాసు వెళ్లాలని అడగాలనుకుంటే ఆవిడగారు అతి నీరసంగా ఇంటికి వచ్చారే!" నీరుగారిపోతూ మెల్లగా అన్న రాధిక మాటలు,

"ఏం, ఆమె నీరసం నిన్ను పంపించేందుకు కష్టమౌతుందా?" నవ్వుతూ అన్న కిరణ్ మాటలు,

"అక్క మన మాటలు విన్నదేమో!" అని సన్నగ వెలిబుచ్చిన మాధవి అనుమానం,

"వింటే ఇప్పటికైనా తెలుసుకుంటుందిలే" అన్న తల్లి జవాబు తన చెవులను సోకి గుండెను మరింత పిండాయి.

యెన్నాళ్ళుగానో వాళ్లలో పేరుకొని పోయిన అభిప్రాయాల నీ రోజు తెలుసుకుంటుంటే కలో నిజమో ననిపిస్తున్నది. తను విన్నదం అబద్ధమేమో నన్న అనుమానం యెంతో సేపు నిలవకుండానే బైట నుండి వినిపిస్తున్న గుసగుసలు అవన్నీ యదార్థమని స్పష్టం చేస్తున్నాయి.

'రాధికకు తను మద్రాసుకు పంపించేందుకు ఆరోగ్యంగా వుండాలి.' విరక్తిగా


వయో పరిమితి లేదు!

PASS PRIVATELY

కాలేజి హాజరు అవసరము లేదు!

తపాలా ద్వారా సమర్థవంతమైన ట్యూషన్ !!! * అతి తక్కువ రుసుము !!!!

మంచి ఫలితము!

★ ఎస్. ఎ. ఎల్. సి., ఎస్. బి. ఎస్., సి. ఎస్. ఐ. బి. ఎస్., బి. యల్., ఎల్ ఎల్. బి., బి. ఇడి., మరియు లా డిప్లమో. (ఏ పట్టభద్రుడైనను అర్హుడు)

★ మైసూర్ బి. ఏ., బి. కామ్. మరియు ఎమ్. ఏ. (గత పరీక్షా లేక తరగతి చదువు అవసరములేదు.)

★ ఉత్కళ ఎమ్. ఎ., అన్నామలయా ఎ. ఏ., (ఒక దఫా గాని రెండు దఫాలుగా హాజరు కావచ్చు) పి. యు. సి. లేక ఇంటర్ ఉత్తీర్ణులు అర్హులు.

★ ఇంటర్ / కామర్సు / పి. యు. సి., మెట్రిక్ / హయ్యర్ సెకండరీ ... (ఎస్. ఎస్. ఎల్. సి., ఎస్. ఎస్. సి., హెచ్. ఎస్. సి., ఉత్తీర్ణులు అర్హులు)

★ ఎస్. ఎ., బి. ఏ., బి. కామ్., మరియు ఎం. ఏ. (రెండుదఫాలుగా)

★ కామ్. యూనివర్సిటి - ఇంటర్, డి. కామ్., బి. కామ్., బి. కామ్. (ఆనర్సు) మరియు ఎమ్. కామ్., (ఎస్. ఎస్. ఎల్. సి., కేరళ కంపార్టుమెంటల్ ఎస్. ఎస్. ఎల్. సి., మెట్రిక్, ఎస్. ఎస్. సి., హెచ్. ఎస్. సి., పి. యు. సి. ఇంటర్, ప్రీ-డిగ్రీ పాసైన / ఫెయిలైన ఇంజనీరింగ్ డిప్లమా అర్హులు.)

★ కర్నాటక పి. యు. సి. మరియు ఆంధ్రా మెట్రిక్ (గత పరీక్షా చదువు అవసరములేదు)

★ హోమియోపతి ★ అకౌంటన్సి ★ ఇ. ఎస్. యల్. ఏ.

★ ప్రీ-మెట్రిక్, ★ సర్వీసు కమీషన్ (అక్టోబరు 1979).

★ సమర్థవంతమైన కరెస్పాండెన్స్ కోర్సులు ★ ప్రపంచంలో ప్రఖ్యాతి వహించిన సమర్థవంతమైన సంస్థ ★ యుఎ. ఎ. ఇ., యుఎ. ఎ. ఎమ్. కామ్. యూనివర్సిటీలచే గుర్తింపబడి, అనుబంధించబడినది ★ గ్యారంటీ సర్టిఫికేటు ఇవ్వబడును.

పూర్తి వివరములకు రు. 2/- మనియార్డరు పంపండి:

SRI MURUGAN TUTORIALS [Estd 21—3—1952 Govt. Regd. No. 3072]

H. O. RISHIVANDIYAM - 606 205, TAMILNADU.

BRANCHES : Madras, Salem, Malaysia, Ceylon, S. Africa, Muritius, Indonesia & S. Andamans.

వ్వకుంది. అనారోగ్యంతో వుంటే ఒప్పుకోదని దప్ప తన గురించి బాధలేదు.

తనంటే చులకనగా మాట్లాడే కిరణ్, మాధవి, వాళ్ళ అభిప్రాయాలతో యేకీభవించే తల్లి.

వీరు తననిలా అనుకోనేందుకు కారణం?

తను బాధ్యత తీసుకోడం తప్పా? తన స్వార్థం చూసుకోక పోవడం వల్లనా?

వాళ్ళు తన గురించి ఆలోచించక పోయేందుకు కారణం!

వాళ్ళ అవసరాలు డబ్బు లేనిదే యేదీ జరగదు. కాని రేపు జరగబోయేది ఈనాడు నిశ్చితంగా తెలుస్తుంటే తనిలాగే వుండగలదా?

ఆ సంఘటన తర్వాత ఇంట్లో వాళ్ళతో మనసువిప్పి మాట్లాడలేక పోతున్నది. వారి మాటల్లో యెన్నో గోచరిస్తూ మనసు చిరాకు పడుతున్నది.

రాధికను మద్రాసు కొద్దని ఆ వుక్రోషంతో అన్నా ఆగలేదు.

"సెలవుల్లో హాయిగా అలా వెళ్ళి రానీ. ఇంట్లో కూర్చొని మాత్రం యేంచేస్తుంది? ఇక ముందు ఈ అవకాశం వస్తుందో! రాదో!" అన్న తల్లితో గట్టిగా యేమీ అనలేకపోయింది.

కిరణ్, మాధవి స్నేహితులతో షికార్లకు సినిమాలకు వెళ్ళడం మామూలుగానే జరుగుతున్నది. తల్లి, వాళ్ళేదో కష్టపడుతుంటే ముస్ముందు మంచి రోజులొస్తాయన్నట్లు అనునయ వాక్యాలు పలుకుతుండడం ఈ మధ్య పరీక్షగా చూస్తున్న తనవెవిని పడకుండా వుండడంలేదు.

అందరూ తనకు కావల్సిన వాళ్ళు! కాని తనెవ్వరికీ అవసరం లేనిది.

మనసులోపడ్డ ఆ భావన వల్లనేమో ప్రతిదీ తప్పుగా కనిపిస్తోంది. మానసికంగా బాగా ఒంటరిదై పోయింది. తనిన్నాళ్ళు హాస్పిటల్ నుండి రాగానే తల్లితో చెల్లెళ్ళతో కొద్దిసేపు కబుర్లు చెప్పనిదే యేపనీ చేసేది కాదు.

ఇప్పుడు వాళ్ళతో అవసరమైనప్పుడు మాట్లాడాలన్నా బుద్ధి పుట్టడం లేదు. యేళ్ళుగా పాతుకుపోయిన వారి భావాలను తెలుసుకున్న ఈ వారం రోజులకే యెంత నరకం అనుభవిస్తున్నది! వాళ్ళనేమీ అనలేక సరిపెట్టుకోలేక యెంత అల్లాడిపోతున్నది!

ఇదివరకు వాళ్ళ భవిష్యత్తు గురించి ఆలోచించిన తన కిప్పుడు తన గురించే ఆలోచించాల్సిన అవసరం వచ్చింది. ఏమైనా తనంటే యోహ్యత వుందని తెలుసుకున్న తర్వాత వాళ్ళ మధ్య వుండడం దుర్భరంగా వుంది.

'కొద్దిరోజులెక్కడైనా వెళ్ళాలి' అనుకుంటున్న తరుణంలో ఈ టూర్ రావడం సంతోషం కలిగించింది.

'సెలవు పెట్టి నిక్కడికో, ఎవరిళ్ళకో వెళ్ళేకన్నా ఇలా వెళ్ళి నలుగురికి సహాయపడుతూ తనను తాను మరచి పోవచ్చు' అనుకున్న తనకు డాక్టర్ మనోహర్ మాటలు మొదట కోపం తెప్పించిన మాట నిజం. కాని అతడికేం తెలుసు ఇప్పటి శాంతి విషయం!

బాధ్యతలకు కట్టుబడి తనవారే తనలోకమని భావించిన తనకు దక్కిన ప్రతిఫలం తనను స్వేఛ్ఛగా తిరగాలన్నట్లు చేసింది. స్వార్థం బుసలు కొడుతున్నది. వాళ్ళ కుత్సితత్వానికి బలిగావద్దని హెచ్చరిస్తున్నది.

తనతో యెక్కువగా పరిచయం లేని మనోహర్ తనకిబ్బంది కలగకుండా వుండాలని అలా అడిగాడని గ్రహించిన తర్వాత తను "మీ కభ్యంతరమా?" అని దురుసుగా మాట్లాడినందుకు బాధగలిగింది.

ఇతరుల పరిస్థితి వర్థం చేసుకొని చేతనైనంత వరకు సహాయపడగలడని అతడి మాటలు, ఆ గొంతు పలికిన తీరే చెప్తున్నాయి. మొదట ఆ విషయం గ్రహించక ఆవేశంగా మాట్లాడినందు కతడేమనుకున్నాడో!

'తనను గర్వపోతనుకున్నాడా?' యిందుకో అతడలా అనుకుని వుంటాడేమోనని అనుకుంటేనే బాధగా వుంది.

తనకు సహాయపడా లనుకున్న అతన్ని అపార్థం చేసుకుంది. మర్నాడు వెళ్ళి అతడికి క్షమాపణ చెప్పుకోవాలని గట్టిగా నిశ్చయించుకుంది.

*      *      *

శాంతి వచ్చేసరికి మనోహర్ పూజా మందిరంలో వున్నాడు.

"కూర్చోండి. అయిదు నిమిషాలలో నాన్నగారు వచ్చేస్తారు" అంటూ అతడి పెద్దకొడుకు విజయ్ వినయంగ కుర్చీ చూపించి, అతడు క్లాసు పుస్తకం తీసుకొని చదువుకుంటూ కూర్చున్నాడు.

ఆ ఇంటిని కొద్దిసేపు పరిశీలనగా చూస్తే చాలు, ఆ ఇంటి పరిస్థితి అర్థమౌతుంది.

అటు ఇటు తిరుగుతూ మధ్య మధ్య శాంతిని పలకరిస్తున్న ఇద్దరు యువకులు మనోహర్ తమ్ముళ్ళు గాను, ఇద్దరు యువతులు అతడి చెల్లెళ్ళుగాను పరిచయం చేసుకున్నారు.

లోపలినుండి వినిపిస్తున్న నీరస స్వరాలు తల్లిదండ్రులవని గ్రహించింది శాంతి



గది గుమ్మం అవతల కూర్చొని ఆడుకుంటున్న పాప అతడి కూతురని సులభంగా గుర్తించవచ్చు.

"అన్నయ్యా, ఈ లెక్క చెప్పవూ ?" అంటూ గది లోపలి నుండి వచ్చిన పదేళ్ళ పాపకు పెద్దవాడిలా బోధిస్తున్న పన్నెండేళ్ళ విజయ్ వంక కండ్లార్పకుండా చూస్తున్నది శాంతి.

"మా స్వర్ణకు లెక్కలు సరిగా రావు. దాదాపు హోంవర్కంతా నేనే చేసి పెట్టాలి ఆంటీ." తనవైపలా తదేకంగా చూస్తున్న ఆమె చూపులను తప్పించుకోవాలని, అతడన్న మాటలు స్వర్ణకు కోపం తెప్పిస్తే శాంతిని వుల్లాస పరిచాయి.

"నీకే లెక్కలు వచ్చని గర్వం." అతడి చేతిలో పుస్తకం లాక్కొని వెళ్ళబోతున్న స్వర్ణ చెయ్యి పట్టుకొని తన దగ్గరకు తీసుకుంది శాంతి.

"అలా అన్నయ్య మీద కోపం తెచ్చుకో వచ్చా ?"

"మరి అన్నయ్య అలా అనవచ్చా ?"

"నేనేమన్నాను ?" చెల్లెలివంక కోపంగా చూసి "తప్పేమైనా అన్నానా ఆంటీ ?" న్యాయం చెప్పమన్నట్లు తనవైపు చూస్తున్న విజయ్‌ను "హోంవర్కంతా నువ్వేచేసి పెడుతున్నావు. పాపం !" అన్న వంక ఉక్రోషంగా చూసి "తెలియనివిచెప్పి అన్నీ చేసి పెట్టినట్లేగా ఆంటీ. చెప్పు." అన్న స్వర్ణను మార్చి మార్చి చూస్తున్నది శాంతి.

వారిద్దరూ యెవరికి వారు తనదే న్యాయమని ఆమె చెప్తుందని ఆశగా యెదురు చూస్తున్నారు. కాని ఆ న్యాయమేదో చెప్పి ఆ చిన్నారి హృదయాల్లో యే ఒక్క హృదయంలోనూ తనమీద కోపం వుండడం ఆమెకిష్టం లేదని వాళ్ళకెలా తెలుస్తుంది?

"చెప్పు ఆంటీ." భుజాలుపట్టి కుదుపుతున్న స్వర్ణను మరింత దగ్గరికి తీసుకుంది అప్రయత్నంగా.

"ఏయ్ నీకెన్నిసార్లు చెప్పాను పెద్ద వాళ్ళను నువ్వన గూడదని" విజయ్ పెద్దరికం చూపిస్తే యేడుపు లంకించుకుంది స్వర్ణ.

"పరవాలేదులే బాబూ చిన్నపిల్ల గదూ !" అని శాంతి అంటే—

"ఇది ఇలా అంటే కల్పన గూడా

# ప్రేమ పాశం

అలాగే అంటుంది." గది గుమ్మం అవతల ఆడుకుంటున్న పిల్లవంక చూస్తూ అన్నాడు విజయ్.

ఆ పిల్లవాడి మాటలు ఆమెకు ముచ్చట గొలుపుతున్నాయి.

ఇదివరకు శాంతి రెండు మూడు సార్లు పనిమీద వచ్చి ఒకటి రెండు నిమిషాలు మాత్రమే కూర్చుంది. అదీగాక తనతో యెవరో ఒకరుండడం వల్ల పిల్లల్ని దూరం

## కిరణ చరణం

చినుకు చినుకును పొంది
వేలి వ్రేళ్ళ మట్టితో చేసుకున్న విందులో
నుంచి విచ్చి పూలో పుట్టి
గాలికి పరిమళాన్ని దానం చేసి పసిపాళ్ళలా
నవ్వుతున్నాయి
కిరణ చరణం సోకగానే కళ్ళు కాంతి
గుళ్ళుగా మారినట్లు
ఆకుల పరిష్వంగంలోంచి గాలి అలలు
మనసును తట్టగానే
ఫౌంటెన్‌లోనుంచి ప్రవాహంలా మనిషి
ఫౌంటెన్లై నిదిగి
మధురోహల సముద్రాన్ని గుండెల్లో
దాచుకుని
తీయని స్మృతుల సంకలనంలోంచి,
కలనం లోంచి ఓ జీవితం స్ఫురించి
కల జయించి నేవోడిపోతాను ఒట్టి మిధ్యనై.

— రామా చంద్రమౌళి.

నుండి చూడడం తప్ప పలకరించే అవకాశం రాలేదు. ఈ రోజు వాళ్ళకింత సన్నిహితంగా వచ్చి వాళ్ళ మాటలు వింటుంటే హాయిగా వుంది. మళ్ళీ తనకు పసితనం వస్తే బాగుండు ననిపిస్తోంది. అలా ఆలోచిస్తున్న ఆమె మళ్ళీ వర్తమానంలోకి వచ్చి, తన జీవితాన్ని పోల్చి చూసుకుంటున్నది.

ఆ యింటి పరిస్థితి ఆర్థికంగా ఉన్నత స్థితి గాదని, ఆ యింట్లో వున్నవారందరూ అతడి సంపాదనమీద ఆధారపడి వున్నారని వాళ్ళనో దరికి చేర్చవలసిన బాధ్యత ఇతడిదేనని తెలుస్తునే వుంది. ఇంచుమించు ఇద్దరి ఆదాయాలొకటే. అతడికి తనకన్నా బాధ్యత లెక్కువ. అయినా అతడు పెండ్లి చేసుకున్నాడు. ముగ్గురు పిల్లలున్నారు. పెండ్లి, పిల్లలు అతడు చెల్లెళ్ళను తమ్ముళ్ళను తల్లిదండ్రులను ఆదుకోడానికి అడ్డు కాలేదు. అతడలా అంత సంసార భారాన్ని మోస్తున్నా పదిమంది వింతగా చెప్పుకోడం లేదు. జాలిగా మాట్లాడడం లేదు. అతడిలాగే బాధ్యతలున్నా తన జీవితం మాత్రం వేరుగా వుంది. ఈ బాధ్యతలు తన ముందు జీవితాన్ని త్యాగం చెయ్యమని చెప్పకపోయినా చెయ్యక తప్పదు. అలా చేస్తేనేగాని బాధ్యతలు తీరవు. ఆ త్యాగాన్ని గొప్పగా ప్రశంసించే వారుండకపోగా తప్పు చేసినట్లు, మనిషే కానట్లు మాట్లాడుతుంటారు. భవిష్యత్తు అంధకార బంధురంగా తయారౌతుంది. ఇది పురుషుడి జీవితంలో జరిగే అవకాశం లేదు. అతడు పెండ్లి చేసుకున్నా బాధ్యతలను యధేచ్ఛగా స్వీకరించవచ్చు.

స్త్రీకో న్యాయం, పురుషుడికో న్యాయం యేర్పరచిన ఈ సంఘంలో మార్పు రానంత వరకు తనలాంటి వారెందరుంటారో! వాళ్ళ జీవితా లటూగాక ఇటూగాక యేమౌతాయో!

"యేమిటిలా వచ్చారు ?" అంటూ వచ్చిన మనోహర్ రాక ఆమె ఆలోచన కంతరాయం కలిగించగా లేచి విష్ చేసి కూర్చుంటూ "టూర్‌కు రావడం లేదని చెప్పేందుకు మాత్రం రాలేదు" అన్నది నవ్వుతూ.

"సారీ. మీకు కష్టమేమోనని అలా అన్నాను గాని మీ రాక నా కభ్యంతరం అని కాదు" వ్యథగా పలికిందతడి స్వరం.

"ఆ నిజం తెలుసుకున్న తర్వాత గలిగిన బాధే పొద్దునే మీ ఇంటికి నడిపించింది. అనాలోచితంగా మిమ్మల్ని నొప్పించాను."

తనలాగే ఆమె బాధ పడుతున్నదని ఆమె మాటలు తెలియచేస్తుంటే చిన్నగా నవ్వాడు మనోహర్. మనిషిని బాధ పెట్టేందుకు పెద్ద పెద్ద కారణాలే కాదు, ఇంత చిన్న విషయాలు గూడా చాలు. యెవరైనా తననపార్థం చేసుకున్నారంటే భరించలేడు మనిషి. మనోహర్ మనసిప్పుడు చాలా తేలిగ్గా వుంది.

(ఇంకా వుంది)

# అమ్మా! నాబూటు ఎంత బాగా మెరుస్తుందోచూడు.



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం. అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు. 'రీగల్'కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల–శక్తివంతమైన–నురుగునిచ్చేది 'రీగల్.' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్,' మీకు ఎంతో పొదుపు చేస్తుంది.

'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.




Rediffusion D.766e/TL/R

# హైదరాబాదు నోట్‌బుక్

**ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు!**

ఆచార్యుడు శిష్యులను ఎలాచూసుకోవాలి — అనే విషయాన్ని గురించి ఆపస్తంబ గౌతమను మార్కండేయాది స్మృతికారులు విపులంగా చెప్పారు. ఆచార్యుడు శిష్యుణ్ణి తన కుమారుని వలె చూస్తూ, అతని ఉన్నతినే కాంక్షిస్తూ, దేనినీ మరుగు చేయకుండా, మనఃపూర్తిగా చదువుచెప్పాలి. ఏదో ఆనదవస్తే తప్ప, శిష్యులతో పనులు చేయించు కోరాదు. శిష్యులు తప్పుచేస్తే ప్రేమతో మందలించాలే గాని భయంకరంగా కొట్టి, అంతకన్నా ఏమి చేస్తాడులే, అని శిష్యుని మనస్సు బండబారేట్టు చేయరాదు. అజ్ఞానంతోగాని, బాల్యం వల్లగాని దురుసుగా ప్రవర్తించినా పుత్రనిరవశేషంగా వారి సరిదిద్దాలి. ఈ గుణగణాలు సంపూర్ణంగా ఉన్నవారు హైదరాబాదు విశ్వవిద్యాలయం తెలుగు శాఖ అధిపతి ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు. జిజ్ఞాస మూర్తీభవించినవారు ఆయన. పూర్తిగా తెలుసుకోక ఏమీ మాట్లాడరు. తెలియనిది తెలుసుకోవడానికి సర్వదా సిద్ధం, చిన్న, పెద్ద అనే తారతమ్యం లేదు. కనుకనే కొత్తపల్లి వారి ప్రతిభకు మురిసిపోయిన మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి వీరి ప్రవృత్తినిబట్టి విద్యాసక్తినిబట్టి విద్వాంసులలో ఉన్నత స్థానమును పొందగలరని ఆశించు నా సంకల్పమును అచిరకాలములో భగవం



తుడు సఫలకార్యునిగాక! అని యోగ్యతాపత్రం ఇచ్చారు. దానిని పిహెచ్.డి. పట్టంకన్నా భద్రంగా దాచుకొన్నారు కొత్తపల్లివారు. తండ్రి శ్రీ వెంకటరత్నశర్మ, తల్లి శ్రీమతి రామలక్ష్మమ్మ. కొత్తపల్లి వారు అమలాపురం హైస్కూలులో మెట్రిక్యులేషన్ ప్యాసై రాజమహేంద్రవరంలో ఇంటర్ చదివారు. అప్పుడు ప్రయాగ వెంకటరామశాస్త్రి, కూచిమంచి గోపాలకృష్ణమ్మ, దిట్టకవి సుబ్రహ్మణ్య శర్మ వంటి విద్వాంసుల వద్ద సంస్కృతం చదివే అవకాశం కలిగింది. చిన్నప్పుడు కడియాల పేరావధానుల వద్ద రెండు సంవత్సరాలు సంహిత సంత చెప్పించుకున్నారు. పిదప విశాఖపట్టణంలో 1940—42 లో తెలుగు ఎం. ఎ. చదివి సర్వప్రథములుగా ఉత్తీర్ణులయ్యారు. ఆ కారణంతోనే విజయనగరం మహారాజా కళాశాలలో తెలుగు శాఖాధ్యక్షులుగా ఉద్యోగం దొరికింది. అప్పుడు కొత్తపల్లి వారి వయస్సు 18 సంవత్సరాలు. విజయనగరంలో ఉన్న 15 సంవత్సరాలు కొత్తపల్లివారికి పాండిత్య సంపాదనకు మంచి అవకాశం కలిగింది. మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయశాస్త్రి, పేరిసూర్యనారాయణశాస్త్రి, పేరి వెంకటేశ్వరశాస్త్రి, కల్లూరి లక్ష్మణమూర్తి శర్మ మున్నగు దిగ్గంతి పండితుల వద్ద వ్యాకరణ, న్యాయాదిశాస్త్రాల ప్రకరణగ్రంథాలు అధ్యయనం చేశారు. విజయనగరానికి వెళ్లడం వెళ్లడం శ్రీ సుబ్బరాయశాస్త్రి ఇంటికే ముచ్చోక (ముచ్చోటా) ఇచ్చి

(44 వ పేజీ చూడండి)


దీర్ఘ వ్యాధులకు ఉత్తమ సిద్ధ వైద్యం!



హస్త ప్రయోగం. అంగము చిన్నదై అపార కాలమందు అపంత్యశక్తి. శుక్లనష్టము, నపుంసకత్వము, హెర్నియా, చర్మవ్యాధులకు పోస్టు ద్వారా కూడా వైద్యం చేయబడును. వరిబీజము(బుడ్డ), మూత్ర వ్యాధులు ఆపరేషన్ లేకుండ. రండి.

డా॥ దేవర, ఫోన్ 551, మార్వాడి గుడి వద్ద, తెనాలి.

బ్రాంచి : 26, నార్త్ బోగ్ రోడ్, మద్రాసు-17

దేహపుష్టికి ఆరోగ్యానికి
పండిత డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
1898 నుండి ప్రసిద్ధి గాంచినది
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్ మదరాసు-17

75 సం.గా అఖండ ఖ్యాతి గాంచిన...
నారసింహాలేహ్యం
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్
అన్నిరకములైన (ముఖ్యముగా పురుషుల) బలహీనతలను పోగొట్టి.. రక్తవృద్ధిని.. పుష్టిని కలిగించు వాజీకరము
* 1 డబ్బా రూ. 8-25. పోస్టేజి అదనం!
పి. శి. వి. అండ్ కో
పెరిదేపి-523273 * ప్రకాశం జిల్లా.
క్యాటలాగు ఉచితం! కోరిన వారికి ఏజెన్సీలు ఇవ్వబడును!!
SUVARNA
BACHI

జౌవిన్ లోషన్
గజ్జి, తామరకు పేటెంటు మందు
అన్ని షాపులలోను దొరకును

అప్పు లభించును
రు. 20,000 లు అంతకు మించి, సరళమైన వడ్డీ మరియు సులభ వాయిదాలపై భవనములు, భూములు, షాపులు, పారిశ్రామిక యూనిట్స్, మిల్లులు, థియేటర్స్, ప్రయివేటు లిమిటెడ్, పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలు, ఓనర్‌షిప్ బ్లాకుల హామీలపై లభించును. వ్రాయండి లేదా నేరుగా సంప్రదించండి.

SUPREME CORPORATION (Bankers)
F. 15, 'EVEREST 7th Floor, Near Famous Cine Laboratory,
Tardeo Road, BOMBAY 400034, Phone : 385126.

(గత సంచిక తరువాయి)

























[ఇంకా ఉంది]

# సినిమా విశేషాలు

—జి.వి.జి.



'వెంకటేశ్వర వ్రత మహాత్మ్యం'లో కవిత



'మంగళ తోరణాలు'లో తాళ్లూరి రామేశ్వరి

## "భువనేశ్వరి"లో విధి ఆడిన నాటకం

తప్పతాగివచ్చి, తలుపు తట్టాడు గోపీ (చంద్రమోహన్). పేరంటానికి వెళ్లివచ్చిన భావన (సుమిత్ర) గాభరాగా తలుపు తీసింది. ఆమె సిగలోని పువ్వుల్ని, అవి విరజిమ్మే సువాసనల్ని ఆఘ్రాణిస్తూ, ఆమెనే చూస్తూండిపోయాడు.

"ఏమిటలా చూస్తున్నారు?"

'మగవాడి చూపుకి అర్థం ఆడదాని మనసుకు తెలిసే ఉంటుంది కదూ? భువనా, రాయిని, కసాయిని సైతం కాలం కదిలిస్తుంది. కాస్తయినా మారుస్తుంది. కాని, నీ మనసుని మాత్రం... భువనా! నాటకంలోని పాత్రలు సైతం ఏదో ఒకనాడు నటన మానేసి, వేషం తీసేసి, నిజరూపాల్లోకి వస్తారే — అలాటిది — తప్పనిసరి పరిస్థితిలో ధరించిన వేషాన్ని ఇలా నటిస్తూనే ఉండాలా మనం?"

"నాటకంలో జీవించేవాళ్ళకు ముగింపు తెర మూసినప్పుడు. జీవితంలో నటించేవాళ్ళకు ముగింపు కన్ను మూసినప్పుడే. గోపీ! నేనూ మనిషినే. మీలోని వేదన, సంఘర్షణ, అర్థం చేసుకోగలను. కాని, ఒక్క విషయం...ఆరిపోవలసిన నా బతుక్కి దైవమై, మీరు అండగా నిలిచారు. అలాటి దైవానికి ఎవరో ఎంగిలి చేసినదానిని నైవేద్యంగా ఇవ్వలేను, గోపీ!"

"కట్!" అని ఆ షాట్ ఓ—కే చేసిన డైరెక్టర్ ఎం. మల్లికార్జునరావు నావంక తిరిగి, "జీవితంలో విధి ఆడిన నాటకంవల్ల భార్యాభర్తలై, జీవితంతో రాజీపడలేక — ఆ హృదయాల సంఘర్షణలో నలిగిపోతున్న రెండు జీవితాల కథే భువనేశ్వరి," అంటూ ఆ సన్నివేశాన్ని వివరించారు. కందిమళ్ళ నారాయణమూర్తి నిర్మించిన జయా ఆర్ట్స్ "భువనేశ్వరి" చిత్రంలో నరసింహరాజు, మాధవి, అల్లు రామలింగయ్య ఇతర ముఖ్య పాత్రధారులు. సత్యం సంగీతం, లక్ష్మణ్‌గోరే ఛాయాగ్రహణం ఇతర ఆకర్షణలు.



'రతీ మన్మధ'లో సంగీత

## కనకాల దేవదాస్ దర్శకత్వంలో చిత్రాలు

"వలిచీమలు", త్వరలో విడుదలయ్యే "నిజం" చిత్రాల తర్వాత దేవదాస్ మూడు చిత్రాలకు దర్శకత్వం వహించబోతున్నారు. ఎన్. కృష్ణంరాజు నిర్మించే నవతా ఆర్ట్స్ 6వ (హాస్యప్రధాన) చిత్రంలో చంద్రమోహన్, నూతన్‌ప్రసాద్ ప్రభృతులుంటారు. జి. కె. వెంకటేశ్ సంగీత దర్శకుడు.

చంద్రమోహన్ హీరోగా వి ఆర్. ఇంటర్నేషనల్‌వారి సంగీత ప్రధాన చిత్రం షూటింగ్ జనవరిలో ప్రారంభమౌతుంది. దీనికి శ్రీనివాస్ కథ రాస్తున్నారు.

శరత్‌బాబు తమిళంలో నిర్మించే చిత్రానికి దేవదాస్ దర్శకుడు.

## రచయిత పుత్రుడు నిర్మించే చిత్రం

మహారథి కుమారుడు టి. కిశోర్ లోగడ ప్రొడక్షన్ కంట్రోలర్‌గా అనుభవం గడించాడు. కృష్ణ హీరోగా విజయనిర్మల దర్శకత్వంలో శ్రీ సారథీ స్టూడియోలో ప్రారంభించబోతున్నట్లు తెలియజేస్తూ కిశోర్ "సరే... ఇక రచయిత మా నాన్నగారే కదా?" అన్నాడు మందహాసంతో.

# జయంతి విజయానికి మార్గాలు

ఆమె ప్రేక్షకుల్ని కన్నీళ్ళతో కరిగించేస్తుంది
తన కొడుక్కి అసలైన తల్లిలా రూపొందుతుంది
అద్భుతమైన 'బిసి బెళ హుళియన్న' వండుతుంది
ఇంకా, లక్స్‌పై తనకు గల మోజును నిర్భయంగా వెలిబుస్తుంది,

"నా చర్మ సౌందర్యాన్ని మృదువుగానూ, మనోహరంగానూ వుంచుకునేందుకు నాకు లక్స్ కావాలి" అంటుంది పయంతి.

Jayanthi




శుద్ధమైన, సౌమ్యమైన లక్స్-
సినీమాతారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు.

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన,

HLL-3815



'యుగంధర్'లో జయసుధ



'బొమ్మలకొలువు'లో

***

# బాలచందర్ దర్శకత్వపు ప్రతిభ

ఎందరో దర్శకులకు సహజంగానే సినిమా ఒక వృత్తి. బాలచందర్‌కు ఒక వ్యసనం. శిలా సదృశమైన విశ్వాసంతో చిత్ర నిర్మాణం చేస్తారు. అంచేత, జయాపజయాల గూర్చిబెంగపెట్టుకోరు. జయమ్మయితే అది మరో చరిత్ర. అపజయమ్మయితే ఒక అందమైన అనుభవం. కృషి మాత్రం నిరాఘాటం.

ఆయన చిత్రాలకు స్టార్స్ అక్కర్లేదు; నటీనటులుంటే చాలు. భారీ సెట్టింగులు అక్కర్లేదు. సహజమైన వాతావరణం ఉంటేచాలు. కథతో బొత్తిగా పని లేదు. సజీవమైన పాత్రలు స్ఫురిస్తే చాలు. మాటల రచయిత గణేశ్‌పాత్రోకి కూడా కథ పూర్తిగా తెలియని సందర్భాలున్నాయి. నటీనటులకు పాత్ర స్వభావాలు మాత్రమే తెలుస్తాయి. నిర్మాతకు బడ్జెట్ తెలుస్తుంది. అంతే. కాలక్రమంలో నెమ్మదిగా అన్నీ రూపు దిద్దుకుంటూ ఉంటాయి. ఆలోచనలు, అనుభవాలు, అభిరుచి, అభిజ్ఞ — అన్నీ చేర్చి చివరికొక కళాఖండం తయారౌతుంది. ఎక్కువగా ఆయన షూటింగ్ జరిపేది ఎండల్లో, ఆరు బయట. యూనిట్‌లోని వారందరికన్నా చురుగ్గా — ఏదో చెయ్యి జారిపోతోంది; మరోక్షణం గడిస్తే













చంద్రమోహన్, కవిత ... 'బుర్రిపాలెం బుల్లోడు'లో నాగభూషణం

ఆకాశం నెత్తిన కూలిపోవచ్చునన్నట్టు ఆయన ఉరకలు తీసి పరుగులు పెట్టి షూటింగ్ చేస్తూంటే, ఆయన వేగాన్ని అందుకోవడం ఎవరి తరమూకాదు "అలసిపోరా ?" అని అడిగితే, 'ఇక్కడెందుకు ? ఇంటికి పోయి అలసిపోతా," అంటారు చిరునవ్వుతో

ఒకసారి ఔట్‌డోర్ షూటింగ్‌లో చూట్టానికే అసహ్యం వేసేట్టున్న ఇడ్లీలు, సీళ్ళ కన్నా అధ్వాన్నంగా ఉన్న టీ చుక్కలను ఆయనతో పని చేస్తున్న కొందరు తినలేక పారేసి, మంచినీళ్ళతో సరిపెట్టుకున్నారు ఆయనమాత్రం ఆప్యాయంగా, ఆదరాబాదరాగా ఆరగిస్తూంటే, ఆశ్చర్యపోయి పక్కనున్న మనిషి అడిగాడు — ఎలా తినగలుగుతున్నారని. "ఆదేమిటి ? ఏదో ఒకటి కడుపులో పడకపోతే సాయంత్రం వరకు పని చెయ్యొద్దా ? షూటింగ్ పూర్తి చేసుకొని ఇంటికి వెళ్ళాక కమ్మటి భోజనం నా కోసం కాచుకుని ఉంటుంది. ఫరవాలేదు," అన్నారు.

ముఖ్యంగా కొత్త నటీనటులతో ఆయన పోట్లు వర్ణనాతీతం. అలవాటైన యూనిట్ మెంబర్లకు అదొక కళువిందు. ముందు చాలా ఓపికగా చెప్తారు. పదిసార్లు చెప్తారు. ధైర్యం చెప్తారు దారి చెప్తారు. చివరికి నటరాజావతారంతో బుద్ధి చెప్తారు. అవతల వ్యక్తి సర్దుకుంటే, వెనువెంటనే అభినందించే సౌహార్ద్రత కూడా ఆయనకుంది.



ఆలాగే షూటింగ్ చూడవచ్చే జనంతో కూడా ఆయనకు ఒక్కోసారి గొడవస్తుంది బుద్ధిగా నిలబడి చూసిపోయే వారితో పేచీలేదు వాళ్ళతో ఆయనే స్వయంగా కబుర్లకు దిగి పలకరించి, వాళ్ళు అడిగిన ప్రశ్నలకు ఓపికతో జవాబులు చెప్పి, ఎంతోష పెట్టి పంపుతారు కొందరు మూక ఉమ్మడిగా వచ్చి షూటింగ్ జరగనివ్వని సందర్భాల్లో మాత్రం ఆయనకు వెర్రి కోపమొస్తుంది ఒకసారి ఏదో కొండమీద నుండి కిందికి "లో ఆంగిల్ షాట్' సిద్ధం చేసి హీరో హీరోయిన్‌ల మీద చిత్రీకరించబోతూంటే - కొండ కింద జనం అడ్డుగాచేరి పక్కకు తప్పుకోవడం లేదు మైక్స్ పెట్టి అరిచారు పోలీసుల చేత చెప్పించారు ప్రయోజనం లేకపోయింది ఇక ఆ రోజుకి షూటింగ్ పేకప్ చెయ్యక తప్పలేదు కాని, పోతూ పోతూ ఒళ్ళుమంట అపుకోలేక కెమెరామన్‌తో జూమ్‌లెన్స్ పెట్టమని చెప్పి, కిందనున్న జనాన్ని అతి సమీపంగా ఆ లెన్స్ ద్వారా చూస్తూ, "ఏం మనుషులయ్యా మీరు ? మా షూటింగ్‌నూ జరపనీయలేదు ఇంతదూరం మీరు ఏది చూడాలని ఆత్రుతతో వచ్చారో అది

సరితని, రజనీకాంత్‌ని డైరెక్ట్ చేస్తున్న బాలచందర్



## సినిమా

మ్మాడకుండా చేసుకున్నారు!'' అన్నారు బాలచందర్ ఎదురుగా నిండించిన తృప్తికోసం.

మేధావులకు సహజంగా ఉండే మొండితనం బాలచందర్‌కూ లేకపోలేదు. అంటే, బొత్తిగా ఎవరి మాటా వినరని అర్థం కాదు. ఎన్ని విన్నా—తన కన్‌విక్షన్స్‌ని సులువుగా వదులుకోరు. పది పదిహేనేళ్ళకు ముందు ఆయన దర్శకత్వంవహించిన తొలి [తమిళ] చిత్రం ''నీర్ కుమిషి'' (నీటి బుడగ). ఆ టైటిల్ ఎవరికీ నచ్చలేదు. ''నిర్మాతగా ఇది నాకు తొలిచిత్రం. దర్శకుడుగా మీకు ఇది తొలిచిత్రం. టైటిల్‌కు మల్లే మన చిత్రం కూడా నీటి బుడగలాగా టుప్‌మని పోతే? అది నా భయం. పేరు మార్చకూడదా?'' అన్నాడు నిర్మాత. ''మార్చక్కర్లేదు. చిత్రం బాగా పోతుందని గారంటీ ఇస్తాను,'' అన్నారు బాలచందర్. నిజంగానే ఆ చిత్రం హిట్‌అయింది. ''ఆ రోజుల్లో నాకు భల్లూకం పట్టు ఉండేది. ఇప్పుడు పూర్తిగా మారిపోయాననుకోండి,'' అంటారు బాలచందర్ నవ్వుతూ

''దర్శకుడిగా నేనేదీ సాధించలేదు. సాధించిందల్లా,'' అంటూ పక్కనున్న కమలహాసన్‌ను చూపుతూ, ''ఇలాటి చక్కని సుందరరూపంగల జన్మతః నటీనటులను తెరకు పరిచయం చేయడమే,'' అంటారాయన.

'డైరెక్టర్ ది గ్రేట్' అనిపించుకున్న బాలచందర్‌కు ఒకే ఒక బలహీనత – ఆరోగ్యం పట్ల బొత్తిగా లక్ష్యంలేదు. అది ఉంటే – పదికాలాల పాటు ఇటు వాణిజ్యపరంగానూ, అటు కళాత్మకంగానూ మంచి చిత్రాలు చూసే అవకాశం మనకుంటుంది. ఉందని ఆశిద్దాం. ★



'గోరింటాకు'లో పద్మ

### శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్

''సుఖశాంతులతో విలసిల్లుతూన్న ఒక కుటుంబంలోని ఓ వ్యక్తి అకస్మాత్తుగా ఏదైనా ఆపదకు గురియైతే, ఆ కుటుంబంలోని ఇతరులపై ఆ ప్రభావం యెలా వుంటుందన్న అంశాన్ని తీసుకొని ఈ చిత్ర కథను రూపొందించాం,'' అన్నారు ''బొట్టు – కాటుక'' చిత్ర నిర్మాణానికి నేతృత్వం వహించే విజయ బాపినీడు. ఈ చిత్రం షూటింగ్ వారి స్వగ్రామం చాటపర్రులో, మురళీమోహన్ స్వగృహంలో ఆగస్ట్ 5 ఉదయం ప్రారంభమైంది. లక్ష్మీ ఫిలిమ్స్ జి. రాఘవేంద్రరావు కెమెరాకు చలనం కలిగించారు. దాసరి నారాయణరావు తొలి క్లాప్ కొట్టారు. ''సెప్టెంబర్ 10 వరకు చాటపర్రు, ఏలూరు పరిసర ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో చిత్ర నిర్మాణం పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాత మాగంటి రవీంద్రనాథ్‌చౌదరి. శ్రీధర్, మాతన్‌ప్రసాద్, మాధవి, జయంతి, నిర్మల, అనిత, సత్యచిత్ర, రాజేశ్వరి ప్రధాన భూమికలు నిర్వహిస్తున్నారు. జంధ్యాల సంభాషణలకర్త. చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి, ఉత్పల, జాలాది గీతాలు రాశారు. జి. కె. రాము ఛాయాగ్రాహకుడు. కె. దుర్గానాగేశ్వరరావు దర్శకుడు. వీరి ''విజయ'' చిత్రం శతదినోత్సవం అదేరోజు సాయంత్రం ఏలూరు సి. ఆర్. రెడ్డి కళాశాల ఆడిటోరియమ్‌లో కొత్త పంథాలో జరిగింది. నటీనటులకు, సాంకేతిక నిపుణులకు మొమెంటోలను అక్కినేని నాగేశ్వరరావు సమర్పించారు.

### పోలిక "అమ్మ"లకే!

''కొన్ని కోణాలనుంచి చూస్తే మీరు హేమమాలినిలా ఉంటారు,'' అని ఎవరైనా అంటే పద్మప్రియ ఒప్పుకోదు. ''పోలికలేం లేవు. పోలిక ఏదైనా ఉంటే ఒక్కటే – వాళ్ళమ్మ పేరు, మా అమ్మ పేరు జయ. అదొక్కటే!'' అంటుందిట.




తప్పక చూడండి!



పి. నాగేంద్రరావు
సమర్పించు
నవశక్తి పిక్చర్స్

# టైగర్

ARTS

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: నందమూరి రమేష్

నిర్మాత: పి. నారాయణరావు

సీడెడ్: ద్వారకా ఫిలింస్ చిత్తూరు: భారతీ ఫిలింస్ నైజాం: రాజశ్రీ పిక్చర్స్ మైసూర్: అజంతా మూవీస్

లక్ష్మీచిత్ర

SREE PUBS

'మంగళ తోరణాలు'లో ఒక దృశ్యం

సినిమా

## డైరెక్టర్ కోటారెడ్డి చిత్రాలు

మురళీమోహన్, ప్రభ నటించిన "ఇల్లాలి ముచ్చట్లు", కృష్ణంరాజు, జయసుధ పాల్గొన్న "కల్యాణ చక్రవర్తి" అనంతరం కోటారెడ్డి దర్శకత్వంలో చంద్రమోహన్, జయచిత్ర నటించే లీలావతి చిత్ర "నా మొగుడు బ్రహ్మచారి" వన్నెల చిత్రానికి అగస్ట్ 3 ఉదయం అన్నపూర్ణ స్టూడియోలో ప్రారంభోత్సవం జరిగింది. ఆ తర్వాత చంద్రమోహన్, సీమ పాల్గొనే క్రామేడ్ కంబైన్స్ చిత్రం సెప్టెంబర్‌లో ప్రారంభమవుతుంది. చంద్రమోహన్, ప్రభాకర రెడ్డి, గిరిబాబు ప్రభృతులతో ఉదయలక్ష్మివారు నిర్మించే చిత్రం కూడా సెప్టెంబర్‌లో సెట్స్‌కు వెళ్తుంది. శ్రీ కవిత చిత్ర కంబైన్స్‌వారి చిత్రం నవంబర్‌లో ప్రారంభింపబడుతుంది. ఎన్. భావనారాయణ సమర్పించే చిత్రానికి కూడా కోటారెడ్డి దర్శకత్వం వహించేటట్లు తెలుస్తోంది.

## సరిత మూవీస్

"గాజుబొమ్మ" అనే చిత్రాన్ని కడప ప్రాంతానికి చెందిన కొందరు యువకులు నిర్మించడానికి పూనుకున్నారు. ఆగస్ట్ 6వ మద్రాసు అరుణాచలం స్టూడియోలో ఒక పాటను రికార్డ్ చేశారు. "ఔత్సాహిక నటీనటులను ఎన్నుకోడానికి నిశ్చయించాం. సెప్టెంబర్ ఆఖరి వారం నుండి పూర్తిగా హైదరాబాద్‌లోనే షూటింగ్ జరుగుతుంది," అన్నారు నిర్మాణ నిర్వహణ బాధ్యత వహించే వెంకటరత్నం. డి. యోగానంద్ వద్ద గత పదహారేళ్ళుగా సహాయ, సహకార దర్శకుడుగా అనుభవం గడించిన ఎ. వి. గణపతిరావు ఈ చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం వహిస్తారు. కథ, మాటలు, పాటలు: గంట్యాలి నారాయణరావు. సంగీతం: ఎం. మల్లికార్జునశర్మ. ఛాయ: బి. జనార్దనరావు. కూర్పు: శివమూర్తి. నిర్మాత: బసిరెడ్డి. ★


తాతినేని ప్రకాశరావు సమర్పించు అనిల్ ప్రొడక్షన్స్
తప్పక చూడండి!
కుడి ఎడమైతే
Ⓐ
కలర్
దర్శకత్వం: టి.యల్.వి.ప్రసాద్
కథ: దాసరి నారాయణరావు
తారకరామ
THARAKARAMA
Bachi




# కిసాన్ స్క్వాషులు మరియు క్రష్‌లు




**మరొక సారి!**

**1978లో జెనీవాలో జరిగిన**
**లిమొండే పోటీలో కిసాన్ ఆరెంజ్**
**స్క్వాష్ బంగారు పతకాన్ని గెలుచుకుంది.**

ప్రకృతిలో తాజా పళ్లు తమ రసాన్ని కిసాన్ స్క్వాషులు క్రష్‌లకు ఇస్తాయి.

సమతూల్యం కలిగిన చిక్కని మిశ్రమంగా రూపొందే కిసాన్ స్క్వాషులు. క్రష్‌లలో వేరే తియ్యని పదార్థాలు కలపవలసి నవసరంలేదు. నీరు సోడాలలో ఇట్టే కరిగే స్క్వాషులు క్రష్‌లు మరుక్షణంలో మధుర పానీయాన్ని అందిస్తాయి.

వివిధకాలాలలో లభించే నారింజ, నిమ్మ, పైనాపిల్, ద్రాక్ష పళ్ల తాజారసాన్ని సంవత్సరమంతా స్క్వాషులు క్రష్‌లలో చవి చూడండి.

ఒకే రకం 20 ఎమ్.ఎల్ల స్క్వాషులు, క్రష్ పెద్ద సీసాలు ఇప్పుడు లభిస్తున్నాయి.

**కిసాన్ రకాలు**

**స్క్వాషులు:- నిమ్మ, నారింజ, మామిడి, లైమ్‌జ్యూస్-కార్డియల్, లెమన్ బార్లీవాటర్**

**క్రష్‌లు:- ద్రాక్ష, పైనాపిల్, నారింజ**




**Kissan**

**Kissan Products Limited**
Post Box No. 1676
Old Madras Road, Bangalore-560 016

# నళిని

## చిట్టారెడ్డి సూర్యకుమారి

( గత సంచిక తరువాయి )

రైలు కదలటానికి రెడీగా వుంది. పండ్లబుట్ట లోనికి అందించాడు అజయ్. కిటికీ దగ్గర కూర్చున్న నళినికి దుఃఖంతో గొంతు పట్టుకొన్నట్టుంది. అంతవరకు నవ్వుతూవున్న ముఖం మలినమైపోయింది.

''వాసవీ! నళినిని తీసుకుపోతున్నావు.'' విష్ఫారంగా అన్నాడు.

''అజయ్! నీ నళినిని నీకు అప్పగిస్తాను డిగ్రీతో. సరా'' అంది.

రైలు కూతవేసి కదిలింది. ''హేపీ జర్నీ! అసలు ఫస్టుక్లాసులో పోవలసింది.'' రైలుతోపాటు కదులుతూ అన్నాడు.

అలా అనటం యెన్నిసార్లో వాళ్లు లెక్కపెట్టలేదు. వాళ్లకి ఫస్టుక్లాసు టికెట్స్ తీస్తానని గొడవచేశాడు.

''మాకు కొత్తగాదు. జనతా కంపార్టుమెంటు మాకు అలవాటేను. అందునా ఫస్టుక్లాసు సుఖమైనా క్షేమంకాదు'' అంటూ నవ్వుచెప్పారు.

రైలు కనపడేంతవరకు చెయ్యి వూపుతూనే వున్నాడు అజయ్. వాసవి ముందు కన్నీళ్లు తుడుచుకోను సిగ్గేసి, బిడియంగా చూసింది. వాసవి కళ్లు కన్నీటితో నిండివున్నాయి.

పరీక్ష ఫలితాల కొరకు వారు యెదురు చూడలేదు. ఫలితాలు ప్రకటింపబడినవని వారికి తెలియలేదు. కాలం అంత వేగంగా తెలియకుండా పరుగెత్తిపోయింది. మోహన్ కంగ్రాట్యులేషన్స్ చెప్తూ వ్రాసిన ఉత్తరం చూశాక, పేపర్లు తిరగవేశారు.

వాసవికి ఫస్టుక్లాసు వచ్చింది. తన కొచ్చినంత సంబరపడి పండుగ చేసింది నళిని. ''నీ అందం చూసి, ఫస్టుక్లాసు నీకు వస్తుందను కున్నాను'' అంటూ అజయ్ వుడికించాడు.

''ఆర్ట్సు వాళ్లకి ఎంత చదివినా క్లాసు రాదు. అంత కష్టం ఎందుకుపడాలని ప్రయత్నించలేదు...'' నళిని బడాయి మాటలకి నవ్వకుండా వుండలేకపోయాడు.

పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సుకి యూనివర్సిటీ ఆఫీసులో 'ఇంటర్వ్యూ'కి రమ్మని పిలుపు వచ్చింది. ఇంటర్వ్యూ తర్వాత మరో నాలుగైదు రోజులలో క్లాసులు మొదలుపెట్టుతారు. ఒకేసారి అప్పటికి తయారయి బయలుదేరింది నళిని.

ప్రయాణమంటే చిన్నవారికైనా, పెద్దలకైనా హుషారు కలిగిస్తుంది. ఇప్పుడీ ప్రయాణం తన ప్రణయానికి అఘాతంలా వుందనిపించింది. మనస్సును పలు విషయాలపైకి మళ్లించను ప్రయత్నించింది. వాసవి, పవిత్ర పావనీలను జ్ఞాపకం చేసింది. మూడు రోజులుగా ప్రయాణమవుతున్నా ఏడ్చి అడ్డేస్తూ వచ్చారు. అలా కాదని వారు స్కూల్‌కి వెళ్లాక హైదరాబాద్‌కి వచ్చి ఒక రోజు అన్నయ్య యింట్లో వుండిపోయారు. చివరికి రాజకుమారి కూడా కంటనీరు పెట్టుకొంది, ''అల్లరి, సందడి మీతోనే వెళ్లిపోతాయి'' అంటూ.

రావుగారు, భార్య భుజంమీద చెయ్యివేశారు. భార్య అంతకూడ కష్టపడటం యిష్టంలేనట్లు. జంటగ రోడ్డు మలుపువరకు వచ్చి ''టాటా'' చెప్పారు.

''మురళితో ఎక్కువగ గడపలేదు. వాడితో వుండాలి'' అంది అన్నయ్య కుటుంబాన్ని గుర్తుతెచ్చుకొంటూ నళిని. ఎన్నో కబుర్లు దొర్లాయి వారిమధ్య. నళినికి అజయ్ రైలువెంట పరుగెత్తి వచ్చిన దృశ్యమే మనో చక్షువుః కనబడుతూ వుంది. మరొక్కసారి చూస్తే చాలనుకుంటూ కళ్లు మూసుకొంది. వాసవి హృదయం త్వరలో బావని చూస్తాననుకొంటే వింతగ స్పందించసాగింది. ఈలాటి తపన తమకి లేవు. చిన్నప్పటినుంచి తామిద్దరూ ఒకటన్న భావన గుంభనంగ వుండిపోయి ఆదిదంపతులం అనుకొంటూవుంటే, అధరాలపై నవ్వు నాట్యమాడింది.

రైలు గమ్యస్థానం చేరింది. సామానంత తలుపు దగ్గర చేర్చారు. రైలు ఆగకముందే వచ్చి కద్దీకి వ్రేలాడుతున్న కూలీకి వప్పచెప్పారు. క్రిందగ వున్న ప్లాట్‌ఫారమ్ పైకి జాగ్రత్తగా దూకారు వాసవి సామానుపై కన్ను వుంచింది. నళిని గుండె యింకా బరువుగానే వుంది. ముఖం వాడిపోయింది చెరిగిన తలను చేత్తో సరిచేసుకొంటూ యధాలాపంగా చూసింది. ఆ కన్నులు విప్పుకొని, నోరు సున్నాలా తెరుచుకొంది. మరో క్షణంలోనే తేరుకొని ''అజయ్'' అంటూ కేకపెట్టింది. వాసవి వులిక్కిపడింది. నళినికి పిచ్చిపట్టిందేమోనని గిరుక్కున తిరిగింది. అప్పటికే ఎదురుగా వున్న అజయ్ మీదపడి కౌగలించుకున్నంత పని చేసింది నళిని.

**జరిగిన కథ-7 :** తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్డారు వాసవి, నళినీలు. తరువాత వాసవితో కలిసి వాళ్లవూరు వెళ్తుంది నళిని. అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది. కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలిసి వాసవి, నళినీలు లేపాక్షి వెళ్లి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు. అక్కడినుండి హైదరాబాద్‌లోని తనవాళ్ళ దగ్గరకు వెళ్తుండగా, రైల్వేస్టేషన్‌లో పరిచయమైన కెప్టెన్ అజయ్, తనని ప్రేమిస్తున్నానని చెప్పగా ఆశ్చర్యపోతుంది నళిని. తన తండ్రి మరణించగా, నళిని యిచ్చిన టెలిగ్రామ్‌ను అందుకొని అక్కడకు చేరుతుంది వాసవి అజయ్ తన తల్లిదండ్రులకు వాసవి, నళినీలను పరిచయం చేస్తాడు. వాళ్ళ దగ్గర శలవు తీసుకొని అక్కగారి పిల్లలతో కలసి హకీమ్‌పేట్ ఏర్‌ఫోర్స్ స్టేషన్‌కి వెళ్ళి, అక్కడివన్నీ చూసి, ఆ తరువాత అక్క రాజకుమారి, బావ రావు గార్లతో మెస్‌లో పార్టీకి వెళ్తారు వాసవి, నళినీలు.

''అజయ్!'' అంది వాసవి తన కళ్లను నమ్మలేనట్టు. అజయ్ ఆనందంగా నవ్వుతూ, ''మీకు సర్‌ప్రైజ్ యిచ్చాను కదా!'' అని, ''నళిని కళ్ళల్లో నీళ్లు చూశాను. వుండలేక పోయాను. ప్లెయిన్‌లో వచ్చాను, మిమ్మల్ని ఇక్కడ రిసీవ్ చేసుకోటానికి.'' మురిపెంగ నళినిని చూశాడు.

తనను చూసి నళిని చూపించిన ఆనందం యింకా అతని మనస్సు నిండ గా వుంది.

అక్కడివారు తమనే చూస్తున్నారని గుర్తించి, త్వరగా స్టేషన్ నుంచి బయటికి వచ్చారు.

స్టేషన్‌కి బావ వస్తాడన్న ఆశ నిరాశ అయింది. సి. సి. యఫ్. వచ్చినందుకు రాలేక పోయాడు మోహన్. వాళ్లని 'రిసీవ్' చేసుకొని, వాళ్ల సౌకర్యాలు చూడటానికి యిద్దర్ని పంపించాడు.

వారు దొరగారి అమ్మాయిలు అని అతిమర్యాద చూపిస్తూ, గాజుసామానుపై చూపే జాగ్రత్తతో వారికి కావలసినవన్నీ అమర్చారు. అజయ్ ఆరోజంతా వారితో వుండి, మరునాడు యూనివర్సిటీ హాస్టల్లో వారిని వుంచి, తిరిగి హైదరాబాదు వెళ్లిపోయాడు. నళిని నవ్వుతూ వీడ్కోలు యిచ్చింది.

* * *

యూనివర్సిటీ బిల్డింగ్ చూడగానే వారి గుండెలు గుభేల్మన్నాయి. అంతవరకు చదివింది ఉమెన్స్ కాలేజీలో. ఏం కట్టారో, ఏం తిన్నారో, ఎలా నడిచారో వారికి తెలియదు అంతవరకు. కో ఎడ్యుకేషన్ ఎలా వుంటుందో? అబ్బాయిలతో కలిసిమెలిసి చదవాలి అనుకొంటుంటే ఏదో పిరికితనంగా వుంది.

హాస్టల్లో పాత స్నేహితులు కలిశారు. కొందరు స్కూలుమేట్సు కూడా వున్నారు.

వాళ్ల సర్టిఫికేట్స్ అన్నీ వెరిఫై చేయించుకోను మెయిన్ ఆఫీసుకు బయలుదేరారు. మెయిన్ బిల్డింగ్‌కు వెళ్తున్నారు. రోడ్డు ప్రక్కన పెద్ద భవంతిని చూసింది. ''ఇది ఫిజికల్ సైన్స్ బిల్డింగ్. దీనివెనుక నాచురల్ సైన్స్ డిపార్టుమెంటు వుంది'' అని చూపెట్టారు పాత అమ్మాయిలు.

అంత పెద్ద కాంపస్‌లో గంభీరంగా వున్న భవంతులలో చదవబోతున్నాం అంటే గర్వం కలిగింది. ఏదో పెద్దరికం వచ్చినట్లయింది.

ఆరోజు 'ఇంటర్వ్యూ' వుంటుంది. క్రొత్త అమ్మాయిలు వస్తారనికాబోలు! ఎక్కడ చూసినా అబ్బాయిలు గుంపులు గుంపులుగా వున్నారు.

'అక్కడ సైకిల్ స్టాండు దగ్గర వున్నవాళ్లు ఇంజనీరింగ్ అబ్బాయిలు'' అని ఎవ్వరో మెల్లిగా అన్నారు

నీట్‌గా తయారై వచ్చి ఫోజులు పెట్టి పిల్చున్నారు. తడబడే అడుగులతో యెలాగో మెయిన్ బిల్డింగ్‌లోకి వెళ్లారు. అమ్మాయిలతో వచ్చిన తల్లిదండ్రులు, అక్కడా అబ్బాయిలు అటు యిటు తిరుగుతున్నారు. జూనియర్స్ మాత్రం భయంభయంగా బిత్తరగా చూస్తున్నారు.

పైన ప్రిన్సిపాల్ ఆఫీసు వుంది. పిలిచేవరకు లేడీస్ వెయిటింగ్ రూములో వుండమన్నారు. అక్కడ ఆయా కాలేజీల నుంచి వచ్చినవారు గుంపులుగా వేరువేరుగా వున్నారు. వెరిఫికేషన్ అయిందనిపించారు. రేపు అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసులో ఇంటర్వ్యూ వుంటుందని చెప్పారు. తీరా బయటికి వచ్చేటప్పటికి అబ్బాయిలు చుట్టుముట్టారు. ''ఏ సబ్జెక్ట్?'' అని ఒకటే గొడవ చేశారు. అడిగినవాటికి సమాధానాలు చెప్పి, హాస్టల్‌కి వచ్చి, ''హమ్మయ్య'' అని ఫ్రీగా గాలి పీల్చుకున్నారు. యూనివర్సిటీ క్రొత్త ప్రదేశం, వాతావరణం క్రొత్తగావున్నా థ్రిల్లింగ్‌గానే వుంది అని అనుకున్నారు.

ఇంటర్వ్యూకి అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్‌కి వెళ్లారు ఆ బిల్డింగ్ చాలా అందంగా వుంది. లోపల యెక్కడ చూసినా స్టూడెంట్స్. అంతమందిలో వాసవి, నళినీలు కలిసిపోయారు. ఇంటర్వ్యూ ముగిసింది. బెరుకు తీరింది. నాల్రోజులకి క్లాసులకి రమ్మన్నారు. ఫీజులన్నీ కట్టేశారు. ఓ పెద్ద బరువు తీరిపోయినట్టు, ఆ ఒక్కరోజుకే



# అద్వితీయ విమల్

ఒక్క విమల్ మాత్రమే ప్రతిసారి మీకు సరికొత్త
సూటింగ్స్‌ను సమర్పిస్తుంది.
ఈసారి - కాంబీ కో ఆర్డినేట్సు - ప్రీమేచ్
చేయబడిన పేంట్-షర్టింగ్ జతలు ఒకే పేకెట్‌లో.




సూటింగ్స్





భారత దేశంలో అత్యంత ఆధునికమైన టెక్స్‌టైలు
మిల్లువారి ఉత్పాదన

అంటానాటుపడిపోయినట్లు మెల్లగా హాస్టల్‌కి వచ్చారు.

హాస్టల్ ముందు చెట్టు నీడలో జీపు, జీపు దగ్గర నిలబడి మోహన్ వున్నాడు. దూరం నుంచే ఒకరినొకరు చూసుకుంటూ వచ్చారు. “వాసవీ! బావని చూస్తే, ఇష్టమైన మాష్టారిని చూసినట్లు వుంటుంది. మమతతో ఏదో భయం కూడ వుంది” అని నళిని అంది.

ఉదయాన తూర్పుదిక్కు, సాయంకాలం పశ్చిమదిక్కు, రెండు కలుసుకొన్నట్లు వస్తున్న ఆ యిద్దర్నీ చూశాడు పలకరింపుగా నవ్వాడు. వాసవి కంటి మెరుపు అతను గమనించక పోలేదు కాని నళిని దగ్గరవుతుంటే అతని గుండె వింతగా స్పందించటమే బాధ కలిగించింది. నళినిని చూసినప్పుడల్లా కణతల్లో రక్తం వేడిగా కొట్టుకొంటుంది. ఆ భావన తను కావాలనుకో లేదు. అదే తనకు తెలియకుండ పుట్టింది. ప్రియబాంధవి వాసవి అంటే మమతానురాగాలకి కొదువలేదు. కాని... కాని... నళిని సందర్శనంలో ఏదో తెలియని భావన, ఉద్రిక్తం కలిగిస్తుంటే అతనికే భయం కలుగుతుంది.

చిన్నపిల్లల్లా దగ్గరకొచ్చి నిల్చున్నారు.



కాకతీయ విశ్వవిద్యాలయం (వరంగల్) నిర్వహించిన డిగ్రీ పరీక్షలలో ఎక్కువ మార్కులు సంపాదించినందుకు బంగారు పతకాలను పొందిన కొంతమంది విద్యార్థినులను ఈ చిత్రంలో చూడవచ్చు. ఎడమనుంచి కుడికి: రేఖాటాండన్, ఫాతిమానాజ్‌నీన్, ఎస్. గిరిజ, ఎస్. విజయ.

“క్రొత్త కోటకు వస్తున్నారా? కారులో డ్రాప్ చేస్తాను” అన్నాడు.

“హుర్రే” అంటూ మోహన్‌ని పట్టి వూపేశారు. మోహన్ క్షణం బిత్తరపోయాడు. ఆ తర్వాత వెంటనే నవ్వేశాడు.

పవిత్ర, పావనీల స్నేహం చేసి వారి అల్లరి, అరుపులు నేర్చుకున్నారు. ఇంకా వాళ్ల మధ్యనే వున్న భావన కలిగింది.

# నళిని

“సెలవుల్లో బొత్తిగా పాడైపోయి వచ్చారు” అని మదురు కొట్టుకొన్నాడు మోహన్

రావుగారు గుర్తుకు వచ్చి, పకపక నవ్వారు

*　　　*　　　*

మృత్యుచ్ఛాయలో నిశ్శబ్దంగ ఇంటి మూలస్తంభం విరిగిపోగా, కూలిపోయి, ఆ యిల్లు ఏడుస్తూ వుంటుందని వూహించింది నళిని.

ఆ యింటి యజమాని పనిమీద పొరుగూరు వెళ్లినట్లు రోజూ వారి పనులు యథావిధిగా జరిగి పోతున్నాయి. ఆ యింట్లో కోడళ్ల నవ్వులు, పనివాండ్ల పరసోక్తులు వినవస్తున్నాయి. వంట యింట్లో నుంచి తాలింపుల వాసనలు బయటికి పోతున్నాయి. ఆ యింటి కొడుకులు, “ఏమ్మా బాగున్నారా? అబ్బో! ఎం. ఎ. కి వెళ్తున్నారా?” అంటూ యథాలాపంగా, ఎప్పటిలాగ పలుకరించారు. ఆ యింటి యజమాని చనిపోయాడు. ఆ యింట ఏ మార్పు లేదు. ఇదేనా జీవితం. చనిపోయాక మన ఛాయకూడా మిగలదు. కొద్ది రోజుల్లో స్మృతులు జ్ఞాపకాలు తుడిచిపెట్టుకపోతాయి. పేరు మాత్రం లీలామాత్రంగ మిగిలిపోతుంది. అంతేనా?

ఆ తండ్రి పిల్లల కొరకు పడిన ఆరాటం, తపన, ఆస్తిని పెంచటానికి, పిల్లల్ని వృశక్తులుగా చేయటానికి ఎంత కృషి బరువు బాధ్యతలు మోసి వుంటాడు. ఎన్నో తంత్రాలు, కుతంత్రాలు చేసి వుండవచ్చు. బ్రతికున్నంతవరకే ఆ బంధాలు, మమతానురాగాలు.

నిట్టూరుస్తూ వంటగది వైపుకు వెళ్లింది. తడిక అనుకొని వృద్ధాప్యపు ముసుగులో గువ్వలా ఒదిగి కూర్చున్న శకుంతలమ్మను చూసి, నేల కంటుకుపోయినట్లు నిల్చుండిపోయింది నళిని. గుర్తుపట్టడానికే వీలులేనంతగ మారిపోయిందా గృహిణి. ఆ హుందాతనం, ఖంగ్‌మనే కంఠస్వరం, అత్తగారి అధికారం, ఆ కళ, గర్వం, నిర్భయత ఒకప్పుడు ఆమెలో వున్నాయంటే నమ్మశక్యం కాలేదు. భర్తలేని లోటు భార్యకే తెలుసు. ఆ దెబ్బ ఎంతటిదో కళ్లకి స్పష్టంగా కనుపించసాగింది. కొండంత కొడుకులు, కోటంత యిల్లు, ఆత్మీయులు, ఆస్తి. తన కేమికావాలి? పసుపు, కుంకుమల ముందు అవి దిగదుడుపేగా! నళిని ముఖకవళికలు చూసి శకుంతలమ్మ తెల్లటి పైచెంగును ముఖానికి కప్పుకొంది. ఆమె ఏడ్పు విని నళిని తలుపు కానుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. ఏడుస్తున్న నళినిని పొదివి పట్టుకొని వాసవి నడిపించుకుపోయింది.

తన కన్నీళ్లు తుడిచేవారెవ్వరు? ఈ ఎం. ఎ. ఎవ్వరికోసం. తనని చూసి గర్వించే తండ్రి లేడు. తలచుకొంటే దుఃఖంతోపాటు భయం కలిగింది వాసవికి. నళినికి తీరని లోటు, తండ్రి ప్రేమను వెంకట్రావుగారి దగ్గర చవిచూసింది. ఒకరి నొకరు పట్టుకొని ఏడ్చారు. కన్నీటితో వారి దుఃఖాన్ని కడిగేసుకోవాలనుకొన్నారు. అప్పటికి వుపశమించినా, ఆ లోటు తీరేదికాదు. అది వారికి తెలుసు.

*　　　*　　　*

రావలసిన లేడీసంతా హాస్టల్‌కి వచ్చి చేరారు వారికి కేటాయించిన గదిలో సామాను చేర్చారు. మంచాలపై పడకలు, గోడకే వున్న రాక్‌లలో పుస్తకాలు, తదితర సామానులు శుభ్రంగా సర్దుకున్నారు.

అజయ్ వెళ్లిన రోజు నుంచి రోజూ వ్రాసిన ఉత్తరాలన్నీ కట్టగా తెచ్చుకుంది నళిని. ఏది ముందో ఏది వెనుకో! అన్నీ చించి తేదీల ప్రకారం అమర్చుకుంది. ప్రతి కవరులో స్వంత అడ్రసు వ్రాసిన కవరు పెట్టాడు అజయ్.

ఉత్తరాలు చదవటంలో అన్నం తినటం కూడా మరిచిపోయింది. చిన్న కారియర్‌లో అన్నం, పెరుగు వేసుకువచ్చి వాసవి నళినికి తినిపించింది. అన్నం తింటూ, మధ్య మధ్య ఉత్తరాలను ముద్దుపెట్టుకొంటూ వ్యాఖ్యానిస్తూ, అతని విరహవేదనను పైకి చదువుతూ, సంతోషిస్తుంటే,

“నళినీ! అతిరహస్యంగా చదువుకోవలసిన విషయాలు. చదవకు. నాకు సిగ్గేస్తుంది” అని చెప్పింది.

“సరే! నీవే చదువు” అని ఒక్కొక్కటి అందిస్తుంటే,

“తప్పు కదూ! ఒకరి వుత్తరాలు అందులో ప్రేమలేఖలు మరొకరు చదవగూడదు” అంది.

నళిని కళ్లు పెద్దవిచేసి, “ఇదెప్పటినుంచి. నీవు, నేను అని? మనలో రహస్యాలు ఏమిటి? నేనే వాసవీ! వాసవే నళిని” అంది. వాసవి ఆ ఉత్తరాలన్నీ సరిచేసి కవర్లలో వుంచి నళిని తల క్రింద వుంచింది.

*　　　*　　　*

చక్కగా ముస్తాబై, తక్కిన క్లాసుమేట్సుతో కలిసి పదిగంటలకి మొదటిరోజు కాలేజీకి



# కొత్త సుప

## నీలి డిటర్జెంట్ బార్






మురికితో మీ నిరంతర పోరాటం ముగిసినట్లే.
న్యూ సుప డిటర్జెంట్‌బార్ సబ్బు నురుగులో
తెల్లదనం బూడిదరంగు మురికిని వదిలించి
మీ బట్టలకు తెల్లదనాన్ని ప్రకాశాన్ని తిరిగి
ప్రసాదిస్తుంది. తెల్ల బట్టలు మరింత తెల్లగాను,
రంగుబట్టలు మరింత ఆకర్షణీయంగాను,
కనిపిస్తాయి. అన్ని రకాల దుస్తులకు ఇది
అత్యుత్తమం. మరే ఇతర డిటర్జెంట్‌బార్ కన్న
న్యూ సుప డిటర్జెంట్‌బార్ చాలా పొదుపైనది.

**మీ బట్టలకు తెల్లని**
**తెలుపును కాంతిని**
**తిరిగి తెస్తుంది**

HARYANA DETERGENTS LTD



maa HDL 16-79 Tel

బయలుదేరారు. కొంత దూరం వెళ్ళేసరికి, ఒక సైకిలు చుట్టూ గుంపుగా అబ్బాయిలున్నారు. అంత గుంపు పోగయ్యారు. ఏం జరిగిందోనని కాస్త భయపడ్డారు. అంతలోనే ఆ గుంపులోంచి విజిల్స్ రాకెట్స్‌లాగ బయటికి వచ్చాయి. ఆ అమ్మాయిల కాళ్ళు గజగజలాడి, అడుగులు తడబడ్డాయి. బిగపట్టి బొమ్మలా నడుస్తూ వెళ్ళారు. బాట కిరువైపుల నిల్చున్నారు. చూస్తూ పూరుకోలేదు. వారి మధ్య ఫేషన్ పెరేడ్‌లాగా అమ్మాయిలు పోతుంటే, ఒకటే కామెంట్స్. పిచ్చి పిచ్చి కామెంట్స్. కొన్ని నవ్వును తెప్పిస్తున్నాయి. అది క్లాసుల టైం. స్టూడెంట్స్ అందరూ ఎవరి క్లాసులో వారుండవలసిన సమయం. కాని ఇందరు అబ్బాయిలు యిక్కడ కాపలాగా నిల్చున్నారు. అందులో సగంమంది వేరే వేరే కాలేజీ పిల్లలు — ముఖ్యంగా ఇంజనీరింగ్ స్టూడెంట్స్.

కామెంట్స్‌తో, విజిల్స్‌తో సరిపుచ్చలేదు. ఒకడు గబుక్కున రిథమాటిగ్గా పద్యములా చెప్పాడు. తక్కినవాళ్ళు కోరస్ ఎత్తుకున్నారు.

**రచయితలకు మనవి**

స్థానికంగ వున్న ర … తలు. కార్టూనిస్టులు కూడ మా కార్యాలయానికి వచ్చి వారి రచనలంద జేస్తున్నప్పుడు వాటితోపాటు … విరునామా గల స్టాంపులంటించి కవరు పెట్టడం అవసరం … సం


**సాంకేతిక విజ్ఞాన గ్రంథములు**

| | | |
|---|---|---|
| ట్రాన్సిస్టర్ రేడియో | వెల | 3-50 |
| ట్రాన్సిస్టర్ రిపేరింగ్ | వెల | 3-50 |
| హౌస్ వైరింగ్ | వెల | 4-25 |
| మోటార్ రీవైండింగ్ | వెల | 5-25 |
| TV మెకానిజం | వెల | 5-25 |
| మోటార్ మెకానిజం | వెల | 5-75 |
| టేప్ రికార్డర్ | వెల | 5-25 |
| వాల్వు రేడియో రిపేరింగ్ | వెల | 10-00 |

పై కనుబరచిన పుస్తకములన్నీ తెలుగు మూలముగా చదివి స్వయముగా తయారు చేసుకొనుటకును. వాటిలో రాగల చిక్కులను రిపేరు చేసుకొనుటకును అయా భాగముల పటములతో అతి సులభముగా అర్థమగునట్లు వివరించబడి యున్నవి. ఇవి ప్రతి ఇంటా ఉంచదగిన, ప్రతి యొక్కరికి ఉపయోగపడే పుస్తకములు.

BALAJI PUBLICATIONS
103 BHARATHIROAD
MADRAS 600 014.


# నళిని

"చర్చి చిక్స్, పిగ్గి టైల్, ఎలిఫెంట్ వాక్, డమ్మి డక్ ఈజ్ దట్ యు ?" నళిని కనుకొనుకుల నుంచి చూసింది. "బాప్‌రే" అంది.

వారి వెనుక లావుగా, పొట్టిగా వున్న అమ్మాయి గునగునమని వస్తూంది. ఆ అమ్మాయి బుగ్గలన్నీ కందిపోయాయి.

ఆ అమ్మాయి ఎంత బాధ పడుతుందో అని అనుకొంది వాసవి. మరో పిల్లాడు "వాలుకనుల దానా!... ..." అంటూ అందుకున్నాడు. 'లాభం లేదు. బాధపడి లాభంలేదు!' అనుకుంటూ ముందుకు సాగిపోయారు.

* * *

ఆ రోజు కాలేజీలో వెల్‌కమ్ పార్టీ వుంది. అంటే జూనియర్స్‌కి సీనియర్స్ వెల్‌కమ్ చెప్తారు. వెల్‌కమ్ పార్టీ అనగానే కొత్త అమ్మాయిలు గుండెలమీద చేతులు వేసుకున్నారు.

ప్రొఫెసర్ స్పీచ్ తర్వాత తప్పకుండ రాగింగ్ వుంటుంది. అంటే క్రొత్త పిల్లల్ని ఏడిపించటం, వుడికించటం.

పార్టీ అంటే భయపడుతూనే ఒకరిని మించి ఒకరు పోటీ పడుతున్నట్లుగా అలంకరించుకున్నారు. క్రొత్త చీరలు రెప రెప లాడుతున్నాయి. ఆయా ఋతువుల్లోని పూలన్నీ ఒకచోట చేరినట్లు జట్లు జట్లుగా పార్టీకి వెళ్ళారు.

అబ్బాయిలు టక్ చేశారు. ఠీవిగా, అందంగా, నీట్‌గా దారి కిరువైపుల నిల్చున్నారు. మరికొందరు హడావుడిగా తిరుగుతున్నారు. ఆ గదివంతా రంగు రంగుల రంగవల్లులు తీర్చిదిద్దారు. కాయితాలతో అలంకరించారు. బోర్డుపై పెయింటింగ్స్ వేశారు. జూనియర్స్‌కి సుస్వాగతం చెప్పారు.

ప్రొఫెసర్ వుపన్యాసానంతరం కొందరు సీనియర్స్ మాట్లాడినారు. అటు తర్వాత క్రొత్తవారు ఒక్కొక్కరే లేచి తనను తాను పరిచయం చేసుకోమన్నారు.

భయపడుతున్న క్షణం రానే వచ్చింది. సీనియర్స్, జూనియర్స్‌ని చుట్టుముట్టారు.

"ఏమండీ! మీరు పాపాయిలా ఏడవండి!" అని అడిగారు ఒక అమ్మాయిని.

'కేర్, కేర్' మని ఏడ్చేదాక వదలలేదు.

కాస్త లావుగావున్న అమ్మాయి దగ్గరకి వచ్చి, "కడుపుతోవున్న స్త్రీ యెలా నడిచి వెళ్తుందమ్మా" అని అడిగారు.

ఆ అమ్మాయి చూపిస్తుంటే గొల్లుమని నవ్వారు. ఈలలు వేశారు. నవ్వుతున్న వాసవి దగ్గరకి వచ్చారు.

"మీ పేరు వాసవి కదూ!" పరిచయంలో తన పేరు యెంతో నెమ్మదిగా చెప్పింది. ప్రక్కనున్న నళినికే వినపడలేదట. వారికి బాగా తెలిసిపోయిందే ?

"మాడమ్మా! మూగవాడు ఆకలిగా వుందని యెలా చెప్పతాడు" అని ప్రశ్నించారు. కడుపు చూపించి చెయ్యి నోటి దగ్గర తెచ్చి సైగ చేసింది వాసవి.

"గ్రుడ్డివాడు కత్తెర కావాలంటే" వెంటనే ప్రశ్నించారు. వాసవి కళ్ళు మూసుకొని రెండు వ్రేళ్ళు కత్తెరలా ఆడించి సైగ చేసింది.

'హో...హో...' ఒకటే గోలగా చప్పట్లు కొట్టారు. వాసవి బిక్కచచ్చి చూస్తూండిపోయింది.

"గ్రుడ్డివాడికి నోరేమైందండీ!" దగ్గరున్న అబ్బాయి వంగి నవ్వుతూ అన్నాడు.

నళిని నవ్వకుండా వుండలేకపోయింది. సీనియర్స్‌తోపాటు ఎంజాయ్ చేస్తున్న నళినిని చూసి...

"మేడమ్! పాలు, టీ పొడరు లేకుండా రెండు కర్రలు మాత్రమే ఇస్తే యెలా టీ చేస్తావు ?"

ఎవ్వరో అబ్బాయి పిల్లిలా అరిచాడు. మరొకరు "మె...మె మెహ" అన్నాడు.

నళిని ఒక్కసారి అలా చూసి కళ్ళు క్రిందికి వాల్చింది. పెదాలు బిగపెట్టి నవ్వును దాచుకుంటూ ఒక చూపుడువ్రేలు మీద మరో చూపుడువ్రేలు అడ్డంగా ఇంగ్లీషు "టి" లాగా పెట్టి చూపించింది



హర్షధ్వానాలు చేశారు. ఒకబ్బాయి జేబులో పెన్ను తీసి ప్రెజెంటు చేశాడు.

వారిని వదలి మరో అమ్మాయిని చూసి, అపోసిట్ సెక్స్ నుండి ఓ తెల్లవెంట్రుకను తెమ్మన్నారు.

ఆ అమ్మాయి తెల్లముఖంవేసి మూగదానిలా చూస్తూండిపోయింది.

అంతలో ఒకబ్బాయి ముందుకు వచ్చి తల వంచి "ఊ... తీసుకోండి" అన్నాడు.

ఆ అబ్బాయి తలమీద బొచ్చుటోపి (తిరుపతి) వుంది. చుట్టూ చేరిన స్టూడెంట్స్ లయబద్ధంగా చప్పట్లు కొట్టారు.

అబ్బాయిలు అల్లరిచేస్తున్నా అమ్మాయిలకి సరదాగానే వుంది.

తిరిగి వారిని ఏడిపించాలనిపించింది. ఎప్పుడైనా ఆ ఛాన్సు రాకపోదా! అని అనుకున్నారు.

అపోజిట్ సెక్స్ అంటే స్వతహాగా ఆకర్షణ వుంటుంది. ఆకర్షణతోనే వారిని ఆకర్షిస్తున్నారు, అనటం వారికి సరదా! అనిపించుకోవడం వీరికి బాగానే వుంది. అలా అనకపోతే, ఆ అల్లరి లేకపోతే ప్రత్యేకత ఏముంది! లైఫ్ డల్‌గా వుండదూ!

ఈ జీవితమే గడిచిపోయిన తర్వాత బంగారు జీవితం అని తలుస్తారు.

* * *

నళిని రాత్రి ఎంత పొద్దుపోయినా సరే అజయ్‌కి ఉత్తరం వ్రాసి పడుకొంటుంది. అప్పుడు నిద్రతో కళ్ళు మూతలుపడుతాయి.

'చదువు' అనే మాట మూడు అక్షరాలేగాని అది ఓ మహాసముద్రము వంటిది. అందులో మునిగినవాళ్ళకి కాలం తెలియదు. రోజులు వారాలుగాను, వారాలు నెలలుగా ఇట్టే చక చక మని మారిపోతాయి.

ప్రతి వారం మోహన్ వస్తాడు. కావలసినవి తెచ్చి యిస్తాడు. సినిమాలు చూపిస్తాడు. జాగ్రత్తగా హాస్టల్లో దించి వెళతాడు. ఆ రోజు కాలకృత్యాలు తీర్చుకొంటుండగానే నళినికి టెలిగ్రాం వచ్చింది. "స్టార్ట్ ఇమీడియట్లీ – అమ్మ" అని మాత్రమే వుంది.

వాసవి నళినీలు ఒకరి మొహం ఒకరు ప్రశ్నార్థకంగా చూసుకున్నారు. ఏదీ వూహించటానికి యిష్టంలేదు. జడ అల్లుకొంటూనే వార్డెన్ దగ్గరకి వెళ్ళి టెలిగ్రాం చూపించి పర్మిషన్ తీసుకొని లీవ్‌లెటర్ ఓ ఐదు రోజులకి వ్రాసి యిచ్చింది నళిని. ఆందోళనగా వున్నవారి వైపు చూసి వార్డెన్,

"డోంట్ వర్రీ. పెళ్ళిచూపులైతేనే యిలాంటి టెలిగ్రాములు వస్తాయి. విష్ యు గుడ్ లక్" అని చెప్పింది.

మేడమ్‌కి థాంక్స్ చెప్పి వచ్చారు.

"నళినీ ఒక్కదానివే పోతావా! నన్ను రమ్మంటావా?"

"నీకు ప్రాక్టికల్స్ పోతాయి. ఎందుకో రమ్మన్నారు. తీరికగా వుత్తరం వ్రాయవచ్చుగా. ఇప్పుడు బస్సుకాని వుండేమో, ట్రైను ఎక్కాలంటే రేణిగుంటకి పోవద్దూ."

ఆలోచనలో వస్తుంటే హాస్టల్‌కి వచ్చే




'శంఖుతీర్థం'లో కృష్ణ, జయమాలిని

దాటపై ఆటోరిక్షా దగ్గర యూనిఫారమ్‌లో వున్న అజయ్‌ని చూసి మొదట గుర్తుపట్టలేదు. అతని నవ్వు చూసి ఇద్దరూ "అజయ్" అని ముక్తకంఠంతో పిలిచారు.

"నేనే!" అన్నట్టు అందంగా 'బౌ' చేశాడు.

"అజయ్! ఇంటిదగ్గర అందరూ బాగున్నారా! నన్ను అర్జంటుగా రమ్మని అమ్మ టెలిగ్రాం యిచ్చింది ఎందుకో?"

"మొన్నటివరకు అందరూ క్షేమంగా వున్నారు...ఇటు పనిమీద మద్రాసుకు వచ్చాను..."

అజయ్‌ను చూశాక వాసవి దిగులు తగ్గిపోయింది. నళిని క్షేమంగా 'అజయ్'తో వెళ్ళుతుంది అని తలచి వారిద్దరూ మాట్లాడుకొంటుండగానే, నళినికి ఐదురోజులకి సరిపడే బట్టలు, టాయ్‌లెట్ సామాను సర్ది సూట్‌కేస్ పట్టుకొచ్చింది.

"వాసవీ! అజయ్ ప్లేన్‌లో తీసుకపోతాడట. నీవు రాకూడదూ?"

వాసవి అజయ్ ముఖం చూసి నవ్వుతూ,

"నాకు ప్రాక్టికల్స్ పోతాయని నీవే అన్నావు ఇందాక. నేను కాలేజికి పోవాలి..." అంటూ తొందరచేసింది.

అజయ్ స్వీట్స్ పాకెట్, పళ్ళబుట్ట వాసవికిచ్చాడు.

"ఇవన్నీ ఎందుకు?" అంది అందుకొంటూ.

"అమ్మాయిలను చూస్తానికి వచ్చినప్పుడు వూరికే రాకూడదటగా–"

"ఇప్పుడే వస్తా" అని నళిని లోనికి వెళ్ళి పది, పదిహేను నిముషాలకిగాని బయటికి రాలేదు. స్కై బ్లూ జెవారన్ చీర కట్టింది. తలను మళ్ళీ దువ్వి బ్లూ రిబ్బన్‌తో మొదట్లో వెంట్రుకలు కాస్త పైకెత్తి పోనీటైల్ లాగా కట్టింది. చెవుల ప్రక్కగా సైడ్‌లాక్స్ దిద్దింది. మెడలో ఏమీ లేదు. లోపితనం, సింపుల్‌గా ఫాషన్‌గ కనిపించింది. [ఇంకా వుంది]

# మీ మదిలో ఒక స్వప్నమాలిక ఈ నవ నవలా చయనిక



| | | | |
|---|---|---|---|
| కరిగిన హరివిల్లు | ఇంద్రగంటి జానకీబాల | నవల | 5.00 |
| విశాలప్రపంచం | " | " | 5.00 |
| సాగరతరంగాలు | మొచర్ల జయశ్యామల | " | 8.50 |
| వీళ్ళా మనుషులేనా | కె. విజయలక్ష్మి | " | 5.50 |
| నిష్కృతి | ఆర్. ప్రమీలాకుమారి | " | 6.00 |
| భ్రమర | శీలా శివరామ్ | " | 5.50 |
| తిరిగి వచ్చిన వసంతం | మల్లీశ్వరి | " | 4.00 |
| ఒక దీపం వెలిగింది | నేరెళ్ళ రామలక్ష్మి | " | 5.00 |
| మేలుకలయిక | కంచర్ల కృష్ణకుమారి | " | 7.00 |
| అరుణ | డి. కామేశ్వరి | " | 9.00 |
| సజీవ స్వప్నాలు | ఆలూరి విజయలక్ష్మి | " | 8.00 |
| మాకీ భర్త వద్దు | " | కథలు | 6.00 |
| మీరు ప్రేమించలేరు | " | " | 7.00 |
| పసిడి మనసుల పాలపాటలు | విజయమారి లక్ష్మి | బాలసాహిత్యం | 3.50 |

మీకు కావలసిన పుస్తకాల ఖరీదులో 1 రూపాయి తగ్గించి ముందుగా M.O పంపితే పోస్టు ఖర్చులు మేమే భరించి ఆ 1 రూపాయికి వి.పి. పోస్టులో పంపగలము.




నవోదయ పబ్లిషర్స్
విజయవాడ-2.. గుంటూరు-2


"దండాలు బాబూ!"

ఎవరో పాసింజరు ఇచ్చిన డబ్బును గల్లాపెట్టెలో వేసుకొని తలెత్తి చిదరింపుగా చూసాడు ఆ కాఫీ కొట్టు యజమాని వెంకన్నశెట్టి.

వీరయ్య వీధి అరుగుమీద గొంతుగ్గా కూర్చొని దీనంగా మొహంపెట్టాడు.

"ఓ టీ యిప్పించండి బాబూ! దీంతో ఏడ్రూపాయల పద్దాలగణాల వుద్ది! ఎల్లుండి డబ్బు అందుతాది. బాకీ అంతా జమకట్టేస్తా!"

ప్రాధేయపడ్డాడు వీరయ్య, వెంకన్నశెట్టి ఎక్కడ అరువు ఆపుచేస్తాడోనన్న భయంతో.

కళ్ళు చిట్లించి వీరయ్యను అవలోకించాడు శెట్టి "అరువు ఆపుచేస్తే మొత్తం జమకట్టడం మానేస్తాడేమో!" అనుకొన్నాడు శెట్టిగారి మొహం ప్రసన్నంగా మారటంతో ధైర్యం వచ్చింది వీరయ్యకి. వీధి పెండికి తగిలించివున్న ప్లాస్టిక్ గ్లాసును చేతిలోకి తీసుకున్నాడు.

"ఓ అరకప్పు టీ ఇప్పించండి బాబూ! పనిలోకి పోవాల!" అన్నాడు.

"ఒట్టి టీయేనట్రా? రెండిడ్లీ కూడా ఏయించుకో. ఈయేల టమాటా చెట్నీ చేయించాను!" అన్నాడు శెట్టి ఆదరంగా.

"సిత్తం! తమరి దయ! ఇప్పటికే సానా బాకీపడిపోయా!" మొహమాటంగా అన్నాడు వీరయ్య.

వీరయ్య వీధి అరుగుమీద కూర్చుని ఇడ్లీ తింటూంటే—

"వీరయ్యా!" పిలిచాడు శెట్టి.

"సిత్తం! సెలవీయండి!"

"రావులుగాడు లేడూ!" అని ఆగి,

"వాడేరా! నీ మేనల్లుడు రావులు! తలారి రావులుగాడు! నాల్నెల్లబట్టి తినేసి పోవడమేగానీ కానీ జమ కట్టడంలేదురా! నేనెక్కణ్ణుంచి తెచ్చిపెట్టను చెప్పు! అన్ని సామాన్లూ ప్రియంగా వున్నాయి గదా!"

"మా రావులుగాడా బాబూ! నాయాల! ఆడికింక అరువీయకండి బాబూ! వూరినిండా అప్పులు! దొరికినకాటికి ముప్పొద్దులా తాగేసి మా మాలపేటంతా దొర్లుతున్నాడు. కరణంగారు రెండు రోజులుబట్టి ఎన్ని కబుర్లు పంపినా ఎల్లటంలేదు!"

వీరయ్యచేత చెప్పించి బాకీ వసూలు

# గెలుపు



- ఓవారా వెంకట సుబ్బారావు -

వెనుకొందాం అనుకొన్న శెట్టి వీరయ్య మాటలకి ఢీలా పడిపోయాడు.

"ఏపాటియ్యాలేంటి బాబూ ?" అడిగాడు వీరయ్య.

"మ్రార్నాపాయిబుదాకా యియ్యాల !" చెప్పాడు విః పుమొహంతో.

అంతలో శాస్త్రులుగారు వస్తూంటే మర్యాదకోసం చాటుకుపోయాడు వీరయ్య.

"శెట్టీ ! మిక్చర్ పెసరట్టూ, ఉప్మా, కాఫీ !" లోనికి అడుగు పెడుతూనే ఆర్డరిచ్చారు శాస్త్రుల్లుగారు.

గల్లాపెట్టె దగ్గరనుండి గబగబా లేచాడు శెట్టి.

"అలాగే బాబూ ! ఒక్క నిమిషంలో తెస్తా ! తవఁరలా కూర్చోండి !" అంటూ పెనం దగ్గరకి వెళ్ళాడు.

బల్లమీద కూర్చొని, టిపిన్లు చేస్తూన్న తక్కిన పాసింజర్లతో బాతాఖానీకి దిగారు శాస్త్రుల్లుగారు. వీరయ్య టీ తాగేసి మెల్లగా జారుకొన్నాడు.

"ఇదిగో శెట్టీ ! ప్రెశిడెంటుగా రమ్మాయికి పెళ్లి ముహూర్తం పెట్టడానికి వెళ్ళాలి ! దుర్మూహోర్తం వచ్చేస్తుంది ! అర్జంటుగా తే ! ఉల్లిచెక్క మరికొంచెం వెయ్ !"

కేకేసారు శాస్త్రుల్లుగారు వీధిలోకి చూస్తూ.

అంతలో మబ్బులేసి వానలా రయ్‌మని దూసుకొచ్చాడు తలారి రావులు ! వాడు ఎకాఎకీని హోల్లోకి రావడం, వస్తూనే శాస్త్రుల్లుగారి కెదురుగా బల్లమీద కూర్చోడం చూసి అంతా ఆశ్చర్యపోయారు.

ఆ తర్వాత వాని ప్రవేశానికి నిరసనగా లేచి నిలబడ్డారు శాస్త్రుల్లుగారు. తింటూన్న టిఫెన్లను అలాగే వదిలేసి తక్కిన పాసింజర్లు కూడా లేచి నిలబడ్డారు. ఎదురుగా పెసరట్లు తిరగేస్తూన్న శెట్టి ఆ దృశ్యాన్ని చూసి నిశ్చేష్టుడయ్యాడు. చేతిలోని అట్లకాడని కిందపడేసి చివాల్న లేచాడు. ముందున్న టేబిలుకు చేతులు ఆన్చి హాయిగా కూర్చున్నాడు రావులు. అంతా తనవైపు కోపంగానూ ఆశ్చర్యంగానూ చూస్తూవుంటే ఏమాత్రమూ జంకలేదు. గ్లాసులోని నీళ్ళను గడగడా తాగేసి కాళీ గ్లాసును టేబిలుమీద దబాల్న వుంచాడు.

"ఏటేస్ ! అలా అచ్చెర్రంపోతారు ? కూకొండి ! టిపెన్లు తినండి ! నానంటే ఎందుకంత బయ్యం ! బందిపోటునా ? కూనీకోరునా ?"

తాగిన మైకంలో 'ముద్దగా వచ్చాయ్' మాటలు.

"భయం కాదురా ! అసహ్యం !" అన్నారు పళ్ళుకొరుకుతూ శాస్త్రుల్లుగారు.

కిసుక్కున నవ్వాడు రావులు.

"అసయ్యవాఁ ? మావంటే అసయ్యవా? మరిగయితే మా పేట సివ్వాచెలంతో ఎందుకు కులుకుతున్నావ్ ? ఆహ ! తెలీ కదుగుతాను ! మావుమాత్రం మదుసులం కావాఁ ?"

రావులు మాటలకి దిక్కుచచ్చిపోయారు శాస్త్రులుగారు.

"ఒరేయ్ ! నీకేవఁయినా అమ్మోరు పూనిందేవిట్రా ?" ఆశ్చర్యంగా అడిగాడు మున్సబుగారి బావమరిది.

"పూనకంనేదూ ! వాలకంనేదూ ! ఎల్లకొండెయ్ !"

నిర్లక్ష్యంగా అన్నాడు రావులు.

"వాణ్ణి ఏ విధంగా బయటకు పంపడమా ?" అని ఆలోచిస్తూ అచేతనుడై పోయాడు శెట్టి.

"ఇదిగో శెట్టీ ! నీ బాకీ అంతా అణాపైసల్తో యిచ్చేత్తాగానీ ఓ పెసరట్టు ఏసి పట్రా ! ఉల్లిపాయిలు ఎయ్యకు ! అల్లం జీలకర్రా ఎయ్ ! వికారంగా వుంది !"

ఆర్డరిచ్చాడు పెద్ద మోతుబరిలా.

"నీకు వికారం కాదురా పిచ్చెక్కింది ! ముందు బయటకు నడు ! నాక్కోపం వస్తే మనిషిని కాదు !"

# ఇంట గెలుపు

అడుగు కదల్చకుండానే కళ్ళురిమాడు శెట్టి.

"ఏటి? నాను బయటికి వడవాలా? నాను మాత్రం డబ్బియ్యనేటి? ఇయ్యాల కాబోతే ఎల్లుండి వసూలు చేసుకొంటావ్ వడ్డీ కలిపి. ఈళ్ళందర్నూ నీకు రెడీ కేసే యిస్తున్నారా? ముందర్జంటుగా పెసరెట్టేసి పట్రా! నేనసలే మంచోణ్ణి కాను!"

మొండిగా సరీగా సర్దుకొని కూర్చున్నాడు రావులు. ఇక లాభంలేదని ప్లేటు మార్చాడు శెట్టి.

"ఒరే! రావులూ! మీ అందరి బేరాలూ నాక్కావాలి. మన చేతికున్న అయిదు వేళ్ళూ ఒక్కలా లేవుకదా! అలాగే మన వర్ణాలూ జాతులూ ఒకటిగా లేవుగదా! నువ్వు రోజూలాగే వీధి అరుగుమీద కూర్చో! టిఫినూ, టీ నీ కాళ్ళ దగ్గరికి పంపిస్తా!" యుక్తిగా నచ్చచెప్పబోయాడు శెట్టి.

"ఇదిగో సెట్టీ! వలవచ్చం మాటలాడక! నీ చేతికున్న అయిదేళ్ళనీ ఒక్కలా మూసు కొంటువ్వావా నేదా? అయిదేళ్ళకీ వుంగరాలు తగిలించావా నెదా? అలాగే మా అందర్నీ ఒక్కలాగే మూడాలి మరి!"

తెల్లమొహం వేసాడు శెట్టి! అంతా అతనిని చికాకుగా చూసారు.

"నే చెప్పేది విను రావులూ! లే! అలా వీధి అరుగుమీద కూర్చో!" అనునయించాడు శెట్టి.

"అలా పనిర్దయ్యా! అళ్ళలాగే నేనూ సెబ్తున్నా. ఈ బల్లమీద కూకొని టేబిలుమీద టిపినెట్టుకొని మరీ తింటా! ఎందుకియ్యవో నేనూ మాత్తా! టిఫిను ఆకులో గాదు ప్లేట్లో ఏసి పట్రా!" తెగించాడు రావులు.

"ఇదిగో శెట్టీ! ఇక్కడ టిఫిను వాడికి యిచ్చావా! యికమీదట మేమెవ్వరం నీ కొట్టుకి రాము! తెల్సిందా?"

భయపెంచారు శాస్త్రులుగారు పట్టు దలగా.

"రేపట్నుంచి కొట్టు మూసెయ్యాల!" అన్నాడు కరణంగారి తమ్ముడు.

"ఆఁ అంతే!" అన్నారు తక్కిన వారంతా.

"ప్లేట్లో తింటాట్ట! ప్లేట్లో!" వేళాకోళంగా అన్నాడు మున్సబుగారి బావమరిది.

"శాస్త్రుల్లుగార్లూ! తొందరపడకండి! ఆడు పొద్దుటే మెక్కేసుకొని వచ్చాడు. ఎవరితో మాటాడుతున్నాడో ఏంటి మాటాడుతున్నాడో ఆడికి తెలియదు!"

అంటూ శెట్టి సర్ది చెప్పబోతూంటే తూలుతూ లేచి నిలబడ్డాడు రావులు.

"సుక్కా సుక్కా అంటావేటయ్యా శెట్టీ! ఇక్కడ సుక్కెయ్యని వాడెవడో సెప్పు! పొద్దుగూకే యేళయేసరికి అసిరిగాడి పాకలో దూరి మూడు రుపాయిలు తాగి ముసుగేసుని సివ్వాచెలం దగ్గరికి పోతాడా సాత్తుర్లు! మున్సబుగారి బామ్మర్ది అక్కడే పక్కేత్తాడు! నీ సంగతి నాకింకా తెల్దనుకో! పోనీ ఆ గొడవెందుగ్గానీ అరిజెంటుగా అల్లం పెసరట్టు తెత్తావా నేకపోతే పెనం కాడికి పోయి నేనే యేసుకోనా?"

తూలుతూ అడుగు వేయలేకపోయాడు. వాడు అన్నంతపనీ చేస్తాడేమోనన్న భయం పుట్టుకొచ్చింది శెట్టికి.

"నే తెస్తాలే! కూర్చో!" అనక తప్పిందిగాదు.

విజయగర్వంతో అందరివైపూ చూసాడు రావులు. "ఛీ!" అని కింద వుమ్మేసారు శాస్త్రుల్లుగారు.

"ఇదిగో సాత్తుర్లూ! చీ గీ అన్నావంటే వా వొప్పుకోను! నాను కడజాతివాణ్ణని చీదరించుకొంటున్నావ్! ఇక్కడింతమంది పొమ్మలున్నారు! కేసెట్టేస్తా జాగర్త!" హెచ్చరించాడు.

"శాస్త్రుల్లుగారూ! ఆడితో ఎంటి! నామాటినండి!" అంటూ చేయి పట్టుకొని వీధిలోకి తీసుకెళ్ళాడు శెట్టి. తక్కినవారంతా ఒక్కుమ్మడిగా బయటకు నడిచారు. శాస్త్రులుగారితో ఏదో చెప్పి తిరిగి లోపికి వచ్చాడు శెట్టి.

రావులు ఒక్కడూ మిగిలాడు కొట్లో! ఎదురుగా గోడకు అంటించివున్న సినీమా బొమ్మనుచూస్తూ పరవశంపొందుతున్నాడు.

"ఇయ్యాల కొత్త బొమ్మొచ్చింది! పట్నం ఎల్లాల! అయిదురూపాయిలు అప్పియ్యి శెట్టీ! వడ్డీ ఏసుకో పర్వాలేదు! తప్పదియ్యా జోతిలచ్మిని మించిపోయింది జయ్మాలిని!"

"చూడు రావులూ! అల్లం జీలకర్ర వేసికదూ కావాలన్నావ్! ఒక్కనిమిషం ఆగు! జీలకర్ర తెప్పిస్తున్నా!"

యుక్తిగా చెప్పాడు శెట్టి.

"ఒక్కనిమిషం ఏటి! గంటసేపన్నా వుంటా! నాయాళ్ళు! అందరూ నన్ను నీ కొట్లో సూసి కుళ్ళి కుళ్ళి ఏడవాల!" అన్నాడు కసిగా.

నిద్రలేస్తూనే ఎవడిమొహం చూసానో! పెద్ద గొడవే వచ్చిపడింది! దుకాణం మూసెయ్యాలగాబోలు! స్వగతం పలుక్కుంటూ వీధి గుమ్మంలో నిలబడి చూస్తున్నాడు ఎవరికోసమో.

అయిదునిమిషాలు గడిచాయ్. శాస్త్రులు గారూ, మున్సబుగారి బావమరిదీ కోటేసుని వెంటవేసుకొని వచ్చారు. కోటేసు రావులు తండ్రి.



# మీ పసిపాపను గమనించండి








# సిరిలాక్®

## తో కలుగుతుంది

ఇది పాపకు పుష్టికరమైన
సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం.

పాలు, పంచదార...ప్రేమతో
పరిపూర్ణమైనది.




దీనిని తయారుచేయడం చాల తేలిక-దీనితో నీరు చేర్చండి-అంతే.



ముందుగా
మరగబెట్టిన నీటితో
సిరిలాక్ చేర్చండి.



బాగా కదపండి.



వెంటనే
యిచ్చేందుకు
తయారు.

మీ పాపకు 3 నెలలు వచ్చేశాయా? అయితే మీ పాప నిండుగా పెరుగుటకు యిప్పుడు చక్కని సమపాళ్ళ దిట్టమైన ఆహారం చాలా అవసరమైవుంది.

సిరిలాక్....పాపలకు పుష్టి కరమైన సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం....ఇది యెంతో రుచికరమైనది....ధాన్యపు పిండి, పూర్తి మీగడపాలు, పంచదారతో తయారైనది. మీ పాప పెరుగుదలకు అతి ముఖ్యముగా అవసరమైన పుష్టిని పూర్తిగా యిస్తుంది.

ఇందులో....

- మీపాప ఆరోగ్యంగా వుండుటకు కావలసిన క్రొవ్వు పదార్థములు, కార్బోహైడ్రేట్లు సరియైన సమపాళ్ళలో వున్నవి.
- మీపాప అనుదినం పెరుగుటకు తగినంత ప్రోటీనులు వున్నవి.
- మీపాప తేజముగ వుండుటకు అదనపు విటమినులు మరియు యినప శక్తి వున్నవి.

-NESTLÉ

SAA/FSL/G/1043/TEL



తొక్క వొలిచిన ఉల్లాసం




నారింజ రుచిగల
**బ్రిటానియా డిలైట్** కరకరల కమ్మదనం నింపుకొన్న బిస్కట్



''ఏట్రా రావులూ? పెద్దా సిన్నా అక్కర్లేదూ? మన జాతెక్కడా ఆళ్ల జాతెక్కడ? బయటకురా!''

వీధి గుమ్మంలోనే ఆగిపోయి కొడుకుని పిలిచాడు కోటేసు.

''ఆరి శెట్టీ! నువ్వూ శాస్తుర్లూ కల్సి సేసిన పనా యిది? నాను రానురా! యియ్యాల యిక్కడ ఈ కొట్లో బల్లమీద టిపిను చెయ్యాల బయటకు రావాల! రావటేత్తే నువ్వు కూడా రా! డబ్బులు వానిమ్పుకొంటాలే! ఇదిగో శెట్టీ! మరో పెసరట్టెయ్యి!''

కొడుకు మాటలకి కోటేసుకి తిక్కరేగింది. లోనికి ప్రవేశించి వీపుమీద రెండు పడేసి బరబరా బయటకు లాక్కుపోయాడు. పట్టులోవున్న రావులు గుమ్మంలో వెలికిలపడిపోయాడు. ఏడుపు మొదలుపెట్టాడు జనం బాగా మూగారు.

''ఏయ్ సెట్టీ! నన్ను కొట్టించి బయటకు ఈడ్సిస్తావుకదూ! ఇప్పుడే కలక్టేరుగారికి రిపోర్టు రాయిత్తా! డిల్లీకి పుత్తరం రాయిత్తా. నీ అంతు చూస్తా! ఓయ్ సాత్తుర్లూ నీ పేరు కూడా రాయిత్తా! ఇక్కడున్న ఈళ్లందరూ సాచ్చులే! ఆఁ! బాబా! చూత్తున్నారుగందా? ఈ సెట్టి నన్ను కొట్టించి బయటకి పంపేసాడు.'' అంటూ బేరమంటూ లేవబోయి మళ్లీ కిందబడ్డాడు.

''నీ బతుక్కి రిపోర్టొకటి!'' అంటూ కొడుకుని లేవదీసాడు కోటేసు.

''ఒరేయ్ బావూ, నువ్వొల్లకో! నీకు తెల్దు! యియ్యేలే డిల్లీ ఎల్ల ఈళ్లంతు తేలుత్తా! నాను మాలోణ్ణని బయట కీడ్పిత్తారా! ఏయ్ సెట్టీ నీరోజులు దగ్గర పడ్డాయ్...'' అంటూ ఏవేవో వాగుతూంటే కొడుకుని తీసుకొనివెళ్లాడు కోటేసు.

''హమ్మయ్య!'' అనుకొన్నాడు శెట్టి. గర్వంగా చూసారు శాస్త్రులుగారు.

అన్ని గ్రామాల్లోలాగే ఆ గ్రామంలోనూ పార్టీలున్నాయ్! పగలూ వున్నాయ్. గోరంతలు కొండంతలుచేసి పిటీషన్ తయారుచేసారు. కోటేసు ఎంత వారించినా లాభంలేకపోయింది. తాసిల్దారుగారికీ కలక్టరుగారికీ పంపడాన్కి రిపోర్టు తయారైందన్న సంగతి శెట్టికి తెల్సిపోయింది. చీమల పుట్టమీద నిలబడ్డ వానిలా గెంతులు వేస్తున్నాడు. అంతలో

## ఇంట గెలుపు

ప్రెశిడెంటుగారు రమ్మన్నారని కబురు రావటంతో బయలుదేరాడు. ఎందుకైనా మంచిదని శాస్త్రులుగార్ని కూడా దీసుకొని బయలుదేరాడు.

''శెట్టీ! మనం తొందరపడ్డావేమో!'' అన్నారు శాస్త్రులుగారు దారిలో.

''బాబూ! తమకీ భయంగానే వుందా?'' అడిగాడు శెట్టి.

''నా మాటకేం! ఆ కొట్టు యజమానివి నువ్వు. కాబట్టి అసలు ముద్దాయి నువ్వు. నీవే కొట్లోకి రానివ్వావుగాదనీ తగిలేసావనీ పిటీషన్ పెడతాడు! నేను కేవలం సాక్షిని మాత్రమే! దీనికి శిక్ష ఏవిటో తెలుసా? శ్రీకృష్ణ జన్మస్థానం!''

భయంతో గజగజలాడిపోయాడు శెట్టి.

''అదేంటి బాబూ! అలాగంటారూ? కోటేసుని తీసుకొచ్చింది మీరేకదా!'' తనకు తోడు తెచ్చుకోవాలని శెట్టి తాపత్రయం.

---

**దీపావళి కథలపోటీ**

**ముగింపు తేదీ**

**8-9-'79**

---

''ఎవరేమి చేసినా అంతా నీ ప్రోద్బలం వల్లనే కదా! నీ కొట్లో జరిగింది! బాధ్యత నీదే!'' తప్పు కావాలని ప్రయత్నం చేస్తున్నారు శాస్త్రులుగారు.

''ఎలాగండీ! ఈ వుచ్చులోంచి బయట పడ్డం?''

''పొరపాటని ఒప్పేసుకొంటే సరి!'' సులువుగా వుపాయం చెప్పారు.

శాస్త్రులుగారూ, శెట్టీ గుమ్మంలో అడుగు పెడుతూంటే ఎదురుగా వెళ్లి తన గదిలోకి ఆహ్వానించారు ప్రెసిడెంటుగారు. రెండు అరఠావుల గ్రంధం శాస్త్రులుగారికి అందించి చదమన్నారు. శాస్త్రులుగారు ఆ సాంతం చదివి, గట్టిగా వూపిరి వదిలారు.

''నన్నుకూడా యిరికించాడన్న మాట! ఈ దస్తూరీ కరణంగారి పినతండ్రి రామనాథంగారిది కదూ?'' అడిగారు.

''ఎవరు రాసారన్నదిగాదు శాస్త్రుల్లుగారూ కొచ్చెను! ఏవిటి రాసారన్నది పాయింటు! నేనీ గ్రామానికి పెద్దననే గౌరవంతో నాతో చెప్పి చేయాలనే వుద్దేశంతో నా దగ్గరకి వచ్చారు తొందర పడొద్దు మాట్లాడతానూ అని చెప్పి వారిని పంపించాను!'' అంటూ శెట్టిగారి వైపు తిరిగారు ప్రెశిడెంటుగారు.

''వాడ్ని కొట్టించి బయటకు పంపేసావుట!''

అడిగారు.

''బాబోయ్! నేను కొట్టించలేదు. తాగి అసభ్యంగా మాట్లాడుతూంటే ఆడి బాబే ఆణ్ణి నాలుగుతన్ని బయటకు లాక్కుపోయాడు! నేనేవీ ఎరగను! శాస్త్రుల్లుగారు కూడా వున్నారు! అడగండి!''

గుండెలు బాదుకొన్నాడు శెట్టి.

నవ్వొస్తే అపుచేసుకొన్నారు ప్రెశిడెంటుగారు.

''కంప్లైంట్ పైకి వెళ్ళలేదయ్యా ఇంకా! వూళ్ళో పెద్దలం మేం వున్నాంగా. ఏమైనా పొరపాట్లు జరిగితే మనలో మనం యిక్కడనే సరిదిద్దుకోవాలి! అంతకూ కుదరకపోతే ప్రభుత్వం ఎలాగూ వుంది. అంటరానివాళ్ళు అనే ఏహ్యభావంతోనూ దురహంకారంతోనూ వాళ్ళని అగౌరవ పరచినా, అంటరానితనాన్ని ప్రోత్సహించినా శిక్ష ఏమిటో తెలుసా శాస్త్రులుగారూ?''

ప్రెశిడెంటుగారి పలకరింపుకి తృళ్ళిపడ్డారు శాస్త్రులుగారు.

''ఆ గొడవలు నాకెందుకు బాబూ! ఏవో నాలుగు మంత్రాలు చదివి రూపాయి డబ్బులు సంపాదించుకొనేవాణ్ణి! నాలుక కరదుగట్టుకుపోతే కాఫీనీళ్ళు తాగుదామని నా శనిఘడియలకొద్దీ ఆ క్షణాల శెట్టిగారి కొట్లో దూరా. నా కర్మకొద్దీ ఈ గొడవంతా నా కళ్ళ ఎదుటనే జరిగింది. ఇందులో నా ప్రమేయం ఏమీలేదు బాబూ! ప్రోత్సహించడం అసలే లేదు! నన్ను యిరికించకండి!''

లబోదిబోమన్నారు శాస్త్రులుగారు.

''అయితే ఆణ్ణి రెచ్చగొట్టింది నేనా శాస్త్రులుగారూ? ఆడు రాగానే లేచిపోయి గొడవచేసింది మీరు కాదూ? ఆడు కొట్లోకి వస్తే వొప్పుకోమని మీరంతా అన్నారుకదా? నేనేమీ అనలేదు ప్రెశిడెంటు గారూ! పెసరట్టు కావాలన్నాడు జీలకర్ర తెప్పించి వేసియిస్తానన్నాను! ఈ శాస్త్రుల్లుగారే కోటేసుని తీసుకొచ్చి నానారభసా చేయించారు!''

అన్న శెట్టి మాటలకి తోక తొక్కిన పాములా లేచారు శాస్త్రులుగారు.

"ఇదిగో శెట్టీ! నేను మంచివాణ్ణి గాను... ఆ కోటేసుగాణ్ణి పిలుచుకురమ్మని చెప్పింది నీవు కదూ? నీ కోమటి యుక్తులూ కుయుక్తులూ నా దగ్గర పనికిరావు!"

వారి పోట్లాటకి విసిగెత్తిపోయారు ప్రెసిడెంటుగారు.

"అబ్బబ్బ! వూరుకోండయ్యా! ఇప్పుడు ఏమీ కొంపలు మునిగిపోలేదు!"

ఆయన మాటలు హామీగా ధ్వనించాయ్ వారికి.

"ఇప్పుడేం చెయ్యమంటారు?" ఏకకంఠంతో అడిగారు.

"ఈ గొడవ నా దగ్గరకి వచ్చింది. నేను సరిదిద్దలేకపోతే అధికారుల దగ్గరకి పోతుంది. చేసినది పొరపాటని ఒప్పుకోవాల్. మరోసారిలా జరక్కుండా వుండాలి!" అన్నారు.

"అలాగే బాబూ! ఆడికి క్షమాపణ చెప్పుకొంటా! వాడి బాకీ అంతా కొట్టి పారేస్తా! కేసులదాకా వెళ్లనీయకండి బాబూ!" బేరానికి దిగాడు శెట్టి.

"అంతటితో చాలదు శెట్టీ!" అని ఆగారు ప్రెసిడెంటుగారు ఏవిటి చెబుతారో అని ఆతృతగా చూసారు శాస్త్రులుగారు

"శలవీయండి బాబూ!" అన్నాడు శెట్టి.

"రేపు వాడి కులస్తులందరూ నీ కొట్టుకి ఒస్తారు... టిఫిన్లూ, కాఫీలు బల్లలమీదనే తినిపించాల!"

సందిగ్ధావస్థలో పడ్డాడు శెట్టి. వెనుక నుయ్యి ముందు గొయ్యి. ఆలోచిస్తూ వుండి పోయాడు.

"ఏమంటావ్?" అడిగారు ప్రెసిడెంటుగారు.

"అలాగే బాబూ! తమరెలా చెబితే అలాగే!" అన్నాడు అంతటితోనైనా గొడవ వదలితే చాలునని.

"ఏం పంతులుగారూ? మీరే మంటారు?"

"అలాగే కానీయండి! కాలం మారింది! మనమూ మారాలి! కానీ నాదొక చిన్న మనవి!" అన్నారు శాస్త్రులు.

"చెప్పండి మంచి సూచనే అయితే అలాగే చేద్దాం!"

* * *

# ఇంట గెలుపు

ఉదయం ఏడుగంటలయేసరికి తన కులస్తులని పదిమందిని వెంటబెట్టుకొని శెట్టి కొట్లోకి జొరబడ్డాడు రావులు పెద్ద హీరోలా. లాంగ్ బెంచీలమీద కుర్చీలమీదా కూర్చున్నారంతా. కోటేసూ వీరయ్యలు మాత్రం వీధి గుమ్మంలోనే నిలబడివుండిపోయారు.

"మీరు కూడా లోనికి వెళ్లండి!" అన్నారు శాస్త్రులుగారు అప్పుడే వచ్చి.

"తమరుకూడా ఇక్కడికి యిలాటప్పుడు ఎందుకు వచ్చినారు బాబూ? ఎదవ ఎంత సెప్పినా యిన్నాడుకాదు! మొండిఎదవ! తమరిక్కడ నుంచి ఎల్లిపొండి బాబూ!" బతిమాలాడు కోటేసు.

"కాలం మారింది తరమూ మారింది. మనం కూడా మారాలి! లోనికి వెళ్లి బల్ల మీద కూర్చోండి!" అన్నారు మరలా.

తాజా వార్తలకు
ఆంధ్రపత్రిక
చదవండి!

"వద్దు బాబూ! మావిక్కడే నిలబడి టీ చుక్క తాగేసి ఎల్లిపోతాం!" అన్నాడు వీరయ్య.

"సరే మీ యిష్టం!" అంటూ లోనికి పోయారు శాస్త్రులుగారు.

కోటేసు కోపంగా కొడుకుని చూసి పళ్ళు కొరికాడు. కానీ వాడు లక్ష్యపెట్టలేదు.

శాస్త్రులుగారు దగ్గరుండి ముందుగా శెట్టిచేత బల్లలమీద మంచినీళ్ళ గ్లాసులు పెట్టించారు.

"ఏటి సెట్టిగారూ! ఈయేల టిఫినూ?"

ఎక్కసెక్కంగా అడిగాడు రావులు.

"ఈరోజు స్పెషల్‌గా సాంబారిడ్లీ సేయించా!"

"సాంబారు ఎక్కువగావేసి మొత్తం పదకొండు ప్లేట్లు పట్టండి. చెంచాలు గూడా యియ్యాల!"

"అలాగే బాబూ!" నమ్రతగా అంటూ లోనికి వెళ్ళాడు శెట్టి. పని కుర్రాడిచేత ఇడ్లీ ప్లేట్లు సాంబారు బాల్చీ పట్టించుకొచ్చాడు.

ఇడ్లీ ప్లేట్లు వరసగా వుంచాడు ఆ కుర్రాడు.

ఆ కుర్రాణ్ణి చూసి అంతా నిర్ఘాంతపోయారు. చివాల్న లేచి నిలబడ్డారంతా.

"ఆ గురవడి చేత్తో ఏదిచ్చినా తినం! ఆణ్ణి బయటకి పంపించండి!" కేకేసాడు రావులు.

"ఏం? ఎందుకని? ఈ వేళనుంచీ ఆణ్ణి పనికి పెట్టుకున్నా! ఆడూ మీ కులం వాడే కదా!" అన్నాడు శెట్టి

"మా కులం ఒకటే అయినా జాతులు వేరు! మా కులంలో వాళ్ల జాతి తక్కువ. వాళ్ల చేతి మంచినీళ్లైనా తాగం!" కస్సుమన్నాడు రావులు.

"తప్పు బాబూ! ఒకరి కులాన్నీ జాతినీ మరొకరు కించపర్చకూడదు! అసహ్యించుకోకూడదు! అది చాలా పెద్ద నేరం!" సౌమ్యంగా చెప్పారు శాస్త్రులుగారు.

"ఈ నాటకం అంతా మీరే ఆడిస్తున్నారన్నమాట! నిన్నేటి సేత్తానో సూడు!" అంటూ అవమానం భరించలేక ఒంటికాలిమీద లేచాడు రావులు.

కోటేసు ఒక్క గెంతులో కొడుకుని పట్టుకొని ఆపాడు. "మన కులంలోనే ఒక జాతివాణ్ణి మరొక జాతివాడు అవమానపర్చుకుంటున్నార్రా! ఒక జాతివాడింట్లో మరో జాతివాళ్లం యిస్తరెయ్యం! ఆళ్ల చేతినీళ్ళు తాగం! మనలో మనకే సఖ్యం లేదురా! అయికమత్తెం అసలే లేదురా! అంటరానితనం మనలోంచే ముందిస్తిగా పోవాల్రా. మనవందరమూ కల్సిగట్టుగా వుండాలిరా! ఆ తర్వాత పెద్ద కులాలవాళ్ళు మనల్ని అవమానపరిత్తే పభుత్వం వుందిరా! ఇంట గెలిచి రచ్చ గెలవాలిరా! అంచేత నోరు మూసుకొని టిపెన్లు తినండి!" అంటూ ఒక ప్లేటు అందుకొని ముందుగా తినడం ప్రారంభించాడు కోటేసు.

"మన జాతి పెద్దోడు సెప్పినాడుగందా! తినండే!" అన్నాడు ఒకడు.

అంతా తినడానికి వుపక్రమించారు. సాంబారు బాల్చీ పట్టుకొన్నారు శాస్త్రులుగారు.



# మీరు కేవలం ఓ బల్బ్ కొనాలనుకుంటే, ధారాళంగా దేనినైనా కొనండి
# కాని మీరు చౌకగా కొనాలనుకుంటే,
# హెచ్‌ఎమ్‌టిని కొనండి



చాలా బల్బులు, ఒక ధరలో ఉంటాయి, అన్నీ ఒకే కాలం మన్నుతాయి. హెచ్‌ఎమ్‌టి బల్బులు కూడా అంతే ధరలో వుంటాయి, కాని చిరకాలం మన్నుతాయి. అందుచేతనే అవి చౌక అయ్యాయి

హెచ్‌ఎమ్‌టి బల్బులు ఎంచేత చిరకాలం మన్నుతాయి?

ఇతర ఉత్పాదకులకన్నా హెచ్‌ఎమ్‌టి కొన్ని ఉత్కృష్టమైన లాభాలను కలిగివుంది. హెచ్‌ఎమ్‌టి మాత్రమే, తమంతట తామే, బల్బు యొక్క అన్ని భాగాలను తయారుచేసే ఏకైక సంస్థ. అంచేత ప్రతి దశలోనూ నాణ్యతను అదుపులో ఉంచేందుకు హెచ్‌ఎమ్‌టికి వీలౌతుందన్న మా

ఇంకా, హెచ్‌ఎమ్‌టి వారు బల్బులు తయారుచేయడం ప్రారంభించక ముందే వారు బల్బులను తయారుచేసే యంత్రాలను ఉత్పాదనచేస్తూ వస్తున్నారు. ఇందువలన కేవలం సాధారణ బల్బులు కాక విశిష్టమైన, ఉత్తమమైన బల్బులు తయారుచేసే సాంకేతిక పరిజ్ఞానపు ఆధిక్యతను హెచ్‌ఎమ్‌టి కలిగివుంది.

అంతేకాదు, హెచ్‌ఎమ్‌టి వారు టంగ్స్రమ్ వారి— అంటే ప్రపంచంలో ల్యాంపులు తయారుచేయడంలో అత్యంత అనుభవం కలిగిన ఒకానొక విశిష్ట సంస్థ... అనుభవం, విజ్ఞానం కలిగివున్నారు. ఇది హెచ్‌ఎమ్‌టి బల్బులకు అంతర్జాతీయ నాణ్యతనిస్తుంది

ఇంకా, హెచ్‌ఎమ్‌టి వారికి, వారి గడియారాలు, యంత్ర పరికరాలు మరియు ట్రాక్టర్లు తయారుచేయడంలో 25 ఏళ్ళగా సంపాదించిన ఖ్యాతి వుంది. మరి ఆ ఖ్యాతినంతా వారు ఓ గాజు ముక్కపై పణంగా ఒడ్డుతున్నారంటే ఏదో వుందన్న మాటే మరి

ఆ వుంది మరి మరింత ప్రకాశవంతమైన కాంతి చిరకాలపు మన్నిక ఇంకా ఉత్తమమైన నాణ్యత. ఇంకా చౌకగూడాను

**hmt**




## హెచ్‌ఎమ్‌టి బల్బులు - మాజీవితంలో వెలుగులు

Rediffusion/H/750 TLe

## ఓడలో గుడి !

సామాన్యంగా ఓడ ప్రయాణం అంటే నెలలు గానీ, కనీసం కొన్ని వారాలైనాగానీ ఉంటుంది. ఈలోగా ప్రయాణీకులకు ఏదైనా గుడికివెళ్లి దైవ దర్శనం చేసుకోవాలని వుంటే ఎలాగా అనేఅనుమానం వోఓడ సొంతదారునికి వచ్చిందట. తత్ఫలితంగా యం. వి. చిదంబరం అనే ఓడలో వోకోవెలనుకట్టి భక్తులైన ప్రయాణీకులు ఆ గుడికివెళ్లవచ్చునని ప్రకటించారట. ఏటొచ్చీ అక్కడ అర్చకుడు ఉండడట. ఇది బానే ఉంది కానీ క్రైస్తవ, మహమ్మదీయ ప్రయాణీకుల మాటేమిటి ?

## బండిలాగే పాము !

కాలిఫోర్నియాకు చెందిన ఫెన్సోమాండు అనే వూరిలో స్మిత్వేల్లై పెన్‌బెర్గ్ అనే అతను ఒకపామును పెంచి, ఆ పాముచేత కొన్నిపనులు చేయించి చూపరుల నాశ్చర్యపరుస్తున్నాడట. కోతిచేతగోడ్డుపక్కగా గారడివాళ్లు, యిళ్లకొచ్చే గారడివాళ్లూ చేసేట్టు యీ కుర్రాడు పాముచేత చిన్న బండిలాగించడం వంటి ఆటలు ఆడించుతున్నాడట.

## అగ్ని పరీక్ష !

మహబూబాబాదుకు చెందిన కందికొండ గ్రామంలో కోడిరామక్క అనే ఆవిడ మనుమరాలి బంగారు గొలుసు ఆమె మెడలోంచి ఎవరో తస్కరించితే, ఆ దొంగ తన దూరపుచుట్టం 25 ఏళ్ల నర్సయ్య యనేవని రామక్క పంచాయితీ పెట్టిందట. నర్సయ్య నెత్తీనోరూ కొట్టుకున్నా ఎవరూ వినలేదట. చివరికి రామక్క వో పరీక్షపెట్టి అందులో గెలిచి నీ నిర్దోషిత్వాన్ని నిరూపించుకోమందట నర్సయ్యను. గ్రామవాసులంతా చూస్తుండగా ఎర్రగా కణకణ లాడుతున్న అయిదడుగుల యినుప గునపాన్ని యీ చివరి నుంచి ఆ చివరి వరకూ లాగాలని, లలాలాగినప్పుడు అతనిచేతులు కాలకపోతే అతను



నిర్దోషి అని, అలాగెలిస్తే, తాను వో అయిదొందలు కూడా యిస్తాననీ రామక్క అన్నదట. ఇదేమి వింత అని గ్రామ ప్రజలు ఆశ్చర్యంలో మునిగి, తేలేలోగా నర్సయ్య యీ పరీక్షకు ఒప్పుకున్నాడట. గ్రామస్తులు సుమారు అయిదువందలమంది చూస్తుండగా ఆ కణకణలాడేయినప గునపాన్ని ఈ చివర్నుంచి ఆచివరికి మూత్యంమూడుసార్లు లాగాడట.అతని చేతులు మామూలుగానే ఉన్నాయట. ఎర్రగాకాలిన ఆ గునపం ఆతను లాగివదేసరికి చల్లారిపోయినట్లుగా వాడిపోయిందట. అలనాటి అగ్నిపరీక్షలో నెగ్గిన సీతాదేవికన్నా యితడే గొప్పవాడని ప్రజలుఆశ్చర్యపోయారట.

## పాముకోరు కుట్టి ప్రాణాలొదిలిన ఘనుడు !

కేరళకు చెందిన కసా అనే వూరిలో వో ఆసామి రాత్రి పొలంనుంచి వస్తూ యింటి ప్రాంతానికొచ్చాక అతన్నో పాము కరిచిందట. తనను కరచి విసవిసా పారిపోతున్న ఆ పామును పట్టుకుని అతను యింటికి తెచ్చి దాని నోరు మూదీదారం పెట్టికుట్టి అంతతో ఆగక ఆపాము కదలకుండా చుట్ట కుదురులా దాన్ని కట్టిపడేశాడట. ఇంతపని చెయ్యడంలో వైద్యంజోలికి పోనందువల్ల విషం తలకెక్కి చనిపోయాడట.

## ఢిల్లీ లో అమ్మాయిల ఆత్మహత్యలు

ఢిల్లీలో పెళ్లయిన రెండు మూడు నెలల్లోపునే పెళ్లయిన అమ్మాయిలు ఆత్మహత్యలు చేసుకోడం యీటీవల ఎక్కువయి పోయిందట.ఎంత లేదన్నా రోజుకుఒక్కఅమ్మాయియినా ఆత్మహత్య చేసుకుంటున్నదట. ఈ విషయంలో కారణం ఏమిటని ఆరాలు తీస్తే కట్న విషయ సమస్యే అని తేలిందట. కట్నం బాకీయో, పెళ్లిలో ఏదో ఒక బాకీయో ఆధారంగా చేసుకుని భర్తగానీ, అతని తరఫువారుగానీ లేకఅతనూ వాళ్లూకూడాకలసిగానీ తమింటికి వచ్చినఅమ్మాయిని రాసి, రంపాన్ని పెట్టడంవల్ల ఆ బాధ తట్టుకోలేక, వేరే గత్యంతరం లేక అబలలు ఆత్మహత్య చేసుకుంటున్నారట.

## కాళ్లతో కారు డ్రైవింగ్!

లండనులో సాదర్లీ అనే యువకునికి చేతులు లేవుట. అతను డ్రయివ్ చేయుడానికిగానూ, కారుని ప్రత్యేకమయిన పద్ధతిలో వో కంపెనీ రూపొందించిందట. ఆ కారును రిచర్డ్ సాదర్లీ రూమామ్లో లండను వీధులలో నడుపుకుంటూ పోతున్నాడట. ఎడమకాలితో స్టీరింగు తిప్పుతూ కుడికాలుతో బ్రేకును, యాక్సిలరేటరునూ అదుపులో పెట్టుకుంటూ అతను చూడముచ్చటగా కారు తోలుకుంటూ పోతాడట.

## బస్‌స్టాండులో తేలు !

సేలం బస్సుస్టాండులో నిలబడ్డ వో టీచరమ్మ చీరలో పుట్టతేలుదూరి సరసరా తొడల వరకూ ఎక్కి అక్కడ చిటుక్కున కుట్టిందట. లోపల ఏమి దూరిందో,ఎలా కుట్టిందో తెలియని ఆమె చీర దులుపుతూ బస్టాండంతా గంతులువేసి అలంగం తిరిగే లోగా బంగారుపడ్డ ఆ పుట్టతేలు అందివచ్చేటట్లు పుట్టుపుట్టునకుట్టి, ఆపైన చీరలోంచి క్రిందికి దూకి, నలుగురికి దర్శనంయిచ్చేసరికి చూపరులు దాన్ని చంపేశారట. చీరనిప్పి విప్పలేక పోయినందువ తేలు వలుమార్లుకుట్టిన కారణాన్ని ఆమె వెర్రి తిరిగి పడిపోయి, వైద్యసహాయం అందేలోగానే చచ్చిపోయిందట.

## మద్యనిషేధానికి నిరసనగా ఉరి పోసుకున్న వృద్ధుడు !

తమిళనాడుకు చెందిన ముల్లుపట్టి గ్రామవాసి డబ్భయ్యేళ్ల మురుగన్ అనే ఆయన గత యాభై యేళ్ళుగా తాను త్రాగుతున్న మద్యానికీమద్య నిషేధంతెచ్చిపెట్టి తనఅలవాటును ప్రభుత్వం నాశనం చేసిందనీ తన సొంత విషయాలలో దేశం జోక్యం కలుగజేసుకోడం తన కిష్టంలేదని, అన్ని సంవత్సరాలుగా త్రాగుతున్న మద్యాన్ని వదలడంకన్నా ప్రాణాన్ని వదలడమే తన కిష్టమనీ వో ఉత్తరంలో వ్రాసి, దూలానికి ఉరిపోసుకు ప్రాణాలొదిలేశాడట.

## మరణానికి కారణం ?

నలివెండ్ల గ్రామానికి చెందిన సింగంరెడ్డి అనే ఆయన, బాలిరెడ్డి అనే ఆయన జూలై 31వ తేదీన జమ్మలమడుగుకోర్టుకు వెళుతుండగా దేవగుడి అనే వూరికిచెందిన శివశంకరరెడ్డి వో యిరవయి మంది తోనూ భయంకర ఆయుధాలతోనూ ఆ యిద్దరి మీదాపడి చంపేశాడట వారిద్దర్నీ.ఈకురుక్షేత్రంలో చుట్టు ప్రక్కల యిండ్లో ఎనిమండుగురికివిపరీతంగా గాయాలయ్యాయట. పోలీసులు గాలిలో తుపాకులు పేల్చారట.








# ఎల్లప్పుడు చైతన్యంగా ఎల్లప్పుడు చురుకుగా

మీ బాబు పెరుగుతున్నప్పుడు, అతను నిరంతరం అధికంగా శక్తి వినియోగిస్తూ ఉంటాడు.

మీ బాబుకు శక్తినిచ్చే రుచికరమైన, పాలతో తయారైన మాల్ట్ చాకొలెట్ పానీయం బూస్ట్. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్ మరియు కొకోతో తయారైనది.

మీ బిడ్డకు శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది అతను రోజంతా, ప్రతి రోజూ కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది.




## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

## బూస్ట్

మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.


దీని తెలుపుచేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి:

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు







ప్రతిసారీ క్రమం తప్పకుండా సూపర్ రిన్ వాడి మీ బట్టలు మరింత తెల్లగా ఎలా అవుతాయో చూడండి. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే ఎంతో తెల్లగా ఉతుకుతుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో ఉంది ఉత్తమమైన తెలుపుచేసే శక్తి. దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి.




## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెలుపు చేసే శక్తి

హిందూస్థాన్ లివర్ వారి విశిష్ట ఉత్పాదన.

లింటాస్—RIN. 34-203 TL (RR)

# గృహిణులకు గొప్పతనం చేకూర్చుతుంది!
# గృహానికి అందాన్ని చేకూర్చుతుంది!

డీలక్స

## Swaticane®

అర్ధవృత్తాకారముగల కేన్

**అర్ధ-వృత్తాకారము గల స్వాతికేన్ ట్రాన్స్పరెంట్ పంచులలో ప్యాక్ చేయబడును.**

- సువాసన గల అనేకమైన ఆకర్షణీయమైన రంగులు
- చేతి సంచులు, బుట్టలు, అలంకరణ వస్తువులు వివిధ డిజైనులలో తయారు చేయుటకు అనువైనది.
- దృఢం, మన్నిక గలిగి వుండుటచే ఎక్కువ కాలం పని చేస్తాయి.
- మీ గృహానికి ఒక ప్రత్యేక అలంకరణ చేకూర్చుతుంది స్వాతికేన్.

Trade Mark Reg. No.
313694-B






తయారుచేయువారు :

**మహారాష్ట్ర ప్లాస్టిక్ ఇండస్ట్రీస్**
పోస్ట్ బాక్స్ నం. 7479
జోగేశ్వరి (తూర్పు)
బొంబాయి-400 060

**జి. బి. జి. — మద్రాసు**

అక్కయ్యా, మా ప్రశ్నలకి మీరు సమాధానాలు యిస్తున్నారు. మీ ప్రశ్నకి సమాధానం ఎవరిస్తారు?

నేను ప్రశ్నలు వేయకుండానే సమాధానాలు రాబట్టుతాను తమ్ముడూ. అడగకుండానే పేగు తెంచి పెట్టడం మా పెద్దమామయ్య నేర్పించాడు!

ఈనాడు మన విద్యాలయాలు ఇలా దిగజారిపో డానికి కారణం ఎవరు?

విద్యార్థులూ, ప్రభుత్వమూను. విద్యార్థులకి చదువక్కరలేదు డిగ్రీకావాలి. ప్రభుత్వానికీ, మంత్రులకీ పని, ఖర్చు కావాలి— పాపం వారి మధ్యపడి లేగ దూడల్లాగా ఉపాధ్యాయవర్గం నలిగిపోతూంది.

**జె. బి. ఆర్. - మొగలవల్లి**

మహిళా సంవత్సరం అయిపోయింది. బాలల సంవత్సరం అయిపోతూంది. పురుషులనిలడిగేవాళ్లే లేరా?

ఆల్ మేన్ కాబినెట్ కద చరణ్‌సింగు గారిది— ఓ పిటిషన్ పడేయండి. మీ కోరికా నెరవేరుస్తారు — అన్నీ సర్దుబాట్లేకద. అందులో ఇదీ ఒకటవుతుంది.

**వెంకట్ - ఉరవకొండ**

నేటి మన చిత్రాలలో ఉన్నత ప్రమాణాలు, నైతిక విలువలు నానాటికి దిగజారిపోతున్నాయి. దీనికి ఎవరు బాధ్యులు?

ప్రేక్షకులు. వారు గెలిపించిన చిత్రమే— కీటురాయిగా— సినిమాలు ఈసెళ్లలాగా పుట్టుకొస్తాయి!!

**కె. ఎ. హెచ్ — (జె.ఎన్.యు) న్యూఢిల్లీ**

మీ సమాధానాలు బాగుంటున్నాయి. ఎంతవరకు ఆచరణ సాధ్యం?

మనసుంటే మార్గం వుంటుంది. పట్టుదల వుంటే నెరవేరే అవకాశం ఏర్పడుతుంది. నేను




కోటిగాడిని రెవెన్యూ ఆఫీసర్‌గా పోస్టు చేయిస్తే సినిమాటిక్ అన్నారు. మొన్న పేపర్లో వార్త చూడండి. ఒక పూరిగుడిసెలో హరిజనకన్య స్టెల్లాలో లిటరేచరు పూర్తిచేసి, పరీక్షలు నెగ్గి డిప్యూటీ కలక్టర్‌గా పోస్టయింది. దీన్నేమంటారు. దీన్ని గురించి రాసినా సినిమాటిక్ అంటారు. ఈ పిల్లది ఆ పూరింటిచుట్టుపక్కలని చూడదా? తల్లింటికి వెళ్ళదా? కళ్ళారి— వాళ్ళలో చైతన్యం రావాలంటే

ఈనాడున్న 'కవి'కి కవయిత్రులకి తేడాఏమిటి? మీరు 'కవి'గారిగార్ల కవయిత్రులా, కవిపాత్రులా?

నేను రెండూ కాదు— కవిపత్నిని!

**డి. పి. వి. చిత్రగుంట**

మన సినిమాలలో కృష్ణుని దగ్గర గోపికలని అందంగా చూపిస్తారు. వారి భర్తలను మాత్రం అందవిహీనంగా అమాయకంగా చూపిస్తారెందుచేత? ఆ రోజుల్లో ఆడవారే అందంగా వుండే వాళ్లనా?

కాదు. రాజును చూసిన కళ్ల మొగుణ్ని మొత్త బుద్ధి వేసిందన్నట్టు కృష్ణుని అందం చాలా గొప్పదని నిరూపించడం కోసం అయివుంటుంది. మగవాళ్లంతా అందవిహీనులైతే అప్పుడు కృష్ణుడు మాత్రం ఏం గొప్ప?!

**కె. వి. ఎస్. - ఎలమంచిలి**

ప్రేమించడం గొప్ప? ప్రేమింపబడడం గొప్ప?

రెండూ గొప్పే — మోసానికి తావివ్వనప్పుడు నమ్మకద్రోహం తలపెట్టనప్పుడు!

**డి. వి. టి. ఎస్. — హైదరాబాదు**

మానవ నిర్జీవ శరీరం కంటే నిర్జీవమైన ప్రమాసు ఎక్కువ విలువ ఎందువల్ల?

పొరపాటు. నిర్జీవశరీరం మట్టిలో కలిసి మట్టిని సారవంతం చేస్తూనేవుంది. విజ్ఞానశాస్త్రానికి డొనేట్ చేస్తే— ప్రయోగాలకి ఉపయోగపడుతుంది. అందుకే యిూ భూమిమీద నిరుపయోగమైనదేదీ లేదనడం.

**కె. టి. ఎస్. ఆర్ - బాణాపూర్**

భూలోకంలో వున్న చంద్రుడు ఆకాశంలోవున్న ముద్దుల ఎర్రగులాబీని ఆశిస్తే ఆ ముద్దుల ఎర్రగులాబిపువ్వు చంద్రుడికి అందుతుందా?

ఆ, మళ్లీ వెడుతున్నప్పుడు ఏ ఆర్మ్‌స్ట్రాంగ్ చేతినో అందుకొమ్మని చెప్పి పంపితే సరి! అయినా ఇదేం పిచ్చిప్రశ్న! భూలోకంలో చంద్రుడు మీరైనట్టూ— అందని ఎర్రగులాబి మీ కందనంత అంతస్తున ఉన్న ఆడపిల్ల అయినట్టూ!!

**ఎల్. వి. ఎస్ - గూడూరు**

పురాణం సీత, వాసిరెడ్డి సీతాదేవి, ముప్పాళ రంగనాయకమ్మగారు ఒకతల్లి బిడ్డల్లాగా వున్నారే— మగవారిని విమర్శించడంలో. . .

తప్పు తప్పు సుబ్బయ్యగారూ, పురాణం సీత నస, వాసిరెడ్డి సీత పస, రంగనాయకమ్మ కసి— ఏవి లేవు నా రచనల్లో— ఆలోచించి చెప్పండి!

**చంద్ర - ఈపురుపాలెం**

చదువులేని స్త్రీలలో మంచితనం, నిజమైన నాగరికత కనిపిస్తుంది. నేడు చదువుకున్న స్త్రీలలో అది చాలా తక్కువ అనిపిస్తుంది.

శుభం. మంచిరోజు చూసి నిరక్షర కుక్షిని కావలసినంత కట్నంతో చేపట్టండి. పాణిగ్రహణం నాడే ప్రామిస్ చేయించుకోండి— అక్షరాలా నేర్చుకుంటానని అనని!! (ఇప్పుడీ వయోజన విద్యొకటి వచ్చి పడింది కద పాపం!)

---

# హైదరాబాద్ నోట్ బుక్

(14వ పేజీ తరువాయి)

జట్కాలో నిరాసని వెళ్లారు. ఆయన కొత్తపల్లి వారికి అస్మదోత్రం సద్దలా అని స్వాగతంచెప్పేరట. విజయనగరంలోనే కొత్తపల్లి వారికి శ్రీ పి. వి. జి. రాజుతోను, సోషలిస్టు పార్టీతోను పరిచయం కలిగింది. డాక్టర్ రామమనోహరలోహియా, జయప్రకాశ్‌నారాయణ్, మీనన్ వంటి మహానాయకుల ప్రసంగాలను తెలుగుచేస్తూ, రాష్ట్రమంతటా ప్రచారం చేశారు. శ్రీ పైడిరాజా వద్ద చిత్రకళనేర్చారు. ఉత్సంగేనా మలినవసనే కాళిదాసు శ్లోకాన్ని చిత్రీకరించి బహుమతి కూడా పొందారు. హిందీ సాహిత్యరత్న లయ్యారు. రాజకీయ పరిచయాన్ని డబ్బుచేసుకోలేదు ఇంతయినా. 1958లో ఢిల్లీ విశ్వవిద్యాలయంలో హిందీ ఎం.ఎ. వారికి తెలుగుచెప్పడానికి వెళ్లారు. వివిధ భాషలు, ఆధునిక విజ్ఞాన శాస్త్రం నేర్చుకోడానికి అక్కడ మంచిఅవకాశం కలిగింది. గొప్ప హిందీ రచయిత బచ్చన్ (హిందీ చలనచిత్ర నటుడు అమితాబ్‌బచ్చన్ తండ్రి), సేట్ గోవిందదాస్, సుమిత్రానందనపంత్, ఉపేంద్రనాధ్ అష్క, మన్మధ్‌నాధ్‌గుప్త— వంటి వారితో సన్నిహితత్వం ఏర్పడింది. హిందీరావడం వల్ల హిందీ వారికి తెలుగు చెప్పడం చాలసులువయింది. ఢిల్లీలోవున్న పదకొండు సంవత్సరాలలోను బెంగాలీ రష్యన్ నేర్చుకొన్నారు. భూగోళ శాస్త్రం, జంతుశాస్త్రం, వృక్షశాస్త్రం మున్నగు ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు నేర్చుకున్నారు. 69 నుండి 78 వరకు తెలుగు అకాడమీ డిప్యూటీ డైరెక్టరుగా వున్నారు. కొత్తపల్లివారు ఇది వరకు సంపాదించిన జ్ఞానమంతా ఇప్పుడు వినియోగపడింది. పెక్కు పథకాలను తీర్చిదిద్దారు.

1978 లో హైదరాబాదు విశ్వవిద్యాలయం కొత్తపల్లి వారిని తెలుగుశాఖ అధ్యక్షులుగా ఎన్నిక చేసి గొప్ప పనిచేసింది. కొత్తపల్లివారు మంచి వాగ్మి. కళాశాల వక్తృత్వపు పోటీలలోను, అంతర్విశ్వవిద్యాలయ వక్తృత్వపు పోటీలలోను ఆయనదే పైచేయి.

ప్రముఖ మార్క్సిస్టు ఎం. ఎన్. రాయ్‌తోను ఆయనకు పరిచయం కలిగింది. 1952లో తెలుగు సాహిత్యంపై ఆంగ్ల ప్రభావం అనే విషయంపై పరిశోధనకు డాక్టరేట్ పొందారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం సెనేట్‌కు ఎన్నికయ్యారు. కొత్తపల్లివారి రచనలలో కొన్ని ప్రౌఢచరిత్ర, వంగసాహిత్యచరిత్ర, గురునానక్ చరిత్ర మున్నగునవి. కథలలో— చచ్చినవాని కళ్లు చేరడేసి, పేదవారికోసం, అసురసంధ్య, దేహళి మున్నగునవి. వారికిబావదాస్యం చేయలేదు. కర్మణ్యేవాధికారస్తేను పూర్తిగా నమ్మినవారు. హైదరాబాదు విశ్వవిద్యాలయం ఈ విజ్ఞాన ఖనిని పూర్తిగా వినియోగించుకోగలదని విశ్వసిస్తున్నాను. కొత్తపల్లి వారి సతీమణి శ్రీమతి లలిత, శ్రీ రాయప్రోలు సుబ్బారావు కుమార్తె.

—తిరుమల రామచంద్ర




# అనేక విధాలైన మీ కలలను వేర్వేరు సందర్భాలలో నిజాలు చేయగలమని హామీయిస్తున్నాం



మీ కలలన్నిటికీ మూలమైన ఒకే ఒక అంశం- మీకూ, మీ కుటుంబానికీ, అందరినీమించి, మీ చిన్నపిల్లలకు, చక్కని జీవితం, సుఖప్రదమైన భవిష్యత్తు. మీ పిల్లలందరు ఆరోగ్యవంతులై, ఉన్నత విద్యావంతులై, జీవిత సమస్యలను స్వయంకృషితో పరిష్కరించుకోవాలని మీరు కోరుకుంటారు. మీ చిన్నతనంలో మీరు కోల్పోయినదానిని వారికి సమకూర్చాలని తాపత్రయపడతారు. అయితే, అందుకు డబ్బుకావాలి! అందులోనూ, సరిపడా కావాలి!!

రేపు సుఖంగా ఉండాలంటే, నేడే జాగ్రత్త పడాలి. సిండికేట్ బ్యాంక్‌లో క్రమపద్ధతిలో పొదుపు చేయటానికి మీరు సిద్ధపడితే, మీ అవసరాలను తీర్చటానికి, మా వద్ద అనేక పథకాలున్నాయి. మీకొరకే వేచియున్న మీ దగ్గరలోని సిండికేట్ బ్యాంక్ బ్రాంచిని సంప్రదించండి. నేడుగాని, రేపుగాని, ఇంకా రాబోయే భవిష్యత్తులోగాని, ఆర్థికపరమైన మీ సమస్యలన్నింటినీ దృష్టిలో ఉంచుకుంటామని, వాగ్దానం చేస్తున్నాం.

మా ప్రత్యేక పథకం

**పిల్లల సంక్షేమ భద్రతా పత్రము**

రూ॥ 100/-. మరియు గుణిజములలో లభిస్తాయి.

ఉ-దా:-

రూ॥ 1,000/-లు విలువైన పత్రము 39 నెలలకు రూ॥ 1,273-50లను, 63 నెలలకు రూ॥ 1,596-00లను సమకూరుస్తుంది.



## సిండికేట్ బ్యాంక్

మా పిల్లల సంక్షేమమే మా ధ్యేయం

[... SB 86 TEL]

# జలుబులు, ఫ్లూను గూర్చిన ముఖ్య విషయాలు మరియు ఈ వ్యాధులను ఎదుర్కొను విధములు



*"జలుబు, ఫ్లూ వల్ల వచ్చే బాధలనుంచి వెంటనే ఉపశమనం ఇవ్వడంలో అనాసిన్ ఎంతో సహాయపడుతుంది" అంటున్నారు నటాలియా డిసోజా.*

## ఏటివలన జలుబులు ఫ్లూ వస్తాయి?

జలుబులు, ఫ్లూగల మనుష్యుల నుండి గాలిలో కొనిపోబడు విషపు నీటి (వైరస్) తుంపురుల వలన జలుబులు, ఫ్లూ వస్తాయి మామూలుగా ఈ వైరస్‌లను ఎదరించు శక్తి మీ శరీరమునకు ఉన్నది. అయితే, అతి ప్రయాన లేక పోషణ చాలమి వలన మీ శరీరము బలహీనమై, రోగమును అడ్డుకొనే దాని శక్తి తగ్గిపోతుంది

## వాటి లక్షణాలు ఏమిటి?

తలభారము, తలనొప్పి, కారెడు ముక్కుతో జలుబు ఆరంభిస్తుంది, వణకుట, బాధ మరియు చెమట పోయుట, సాధారణంగా ఫ్లూతో వస్తాయి. దగ్గు, గొంతునొప్పి, ఒడలంతా నొప్పులు, ఆకలి లేమి మరియు అలుపు కూడ ఉండవచ్చును.

## అది చిక్కులను దారి తీయవచ్చునా?

వెంటనే నివారించకపోతే ఫ్లూ, న్యుమోనియా మరియు శ్వాస మార్గము పైభాగములో రోగ సంక్రమణకు దారి తీయవచ్చును.

## అనాసిన్ ఎలా సహాయ పడుతుంది?

అనాసిన్ జలుబులు మరియు ఫ్లూ బాధలనుంచి ఉపశమనం కలిగిస్తుంది. అనాసిన్ బలీయమైనది—అది ప్రపంచమంతటా డాక్టర్లు సిఫారసు చేసే బాధా నివారక పదార్థం కలిగియున్నది. అనాసిన్ లక్షలాది ప్రజలకు విశ్వసనీయమైనది. డాక్టర్లు ఇచ్చే విశ్వసనీయమైన ప్రిస్క్రిప్షన్ లాగా అది మందుల మిశ్రమం. జలుబు, ఫ్లూల యొక్క హెచ్చరిక లక్షణాలు కనిపించగానే, అనాసిన్ కొంచెం నీళ్ళతో రోజులో నాలుగు సార్లు తీసుకోండి.

## మీరు ఇంకా ఏమి చేయాలి?

- మరగబెట్టిన నీరు, నారింజ లేదా బత్తాయి పండు రసం లాంటి ద్రవ పదార్థాలను ఎక్కువగా త్రాగండి.
- పుష్టికరమైన ఆహారాలను తినండి.
- తగినంత విశ్రాంతి తీసుకోండి.
- ఆంటిసెప్టిక్ ద్రవముతో లేక ఉప్పు నీళ్ళతో గొంతుకు పుక్కిలి పట్టండి.



శక్తివంతమైన మరియు విశ్వసనీయమైన
మేనర్స్
అనాసిన్*

భారత దేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పినివారిణి
జెఫ్రీ మేనర్స్ వారి అనాసిన్ విభాగం నుంచి

* Regd. TM

A24-6/79


# వారఫలం

**7-9-1979 శుక్రవారం మొదలు 13-9-1979 గురువారం వరకు**

**మేషం:-** వార గ్రహఫలం అనుకూలం. ఆదాయం కలిసి వస్తుంది. పెద్దల అనుగ్రహం, మిత్ర సహాయ సంపత్తుల వలన కార్యానుకూలత కలదు. చివరి మూడు దినాలలో ధనప్రాప్తి. కృషికి తగిన పారితోషికం లభ్యం. కొన్ని విషయాలలో తీవ్ర కృషి చేసి ఫలితం సంపాదించగలరు. స్త్రీలకు: శుభాశుభ మిశ్ర ఫలితాలుంటాయి.

**వృషభం:-** వ్యవహారాల పరిష్కారానికి పెద్దల సలహాలు కోరుకుంటారు. సహాయం కోరటం కూడా జరుగుతుంది. అందువల్లా లాభదాయకంగా పనులు పరిష్కారమవుతవి. కొందరకు ఉద్యోగంలో అభివృద్ధి చెప్పవచ్చు. ఆదాయానికిగాని, ఇతరుల ఆదరాభిమానాలకుగాని లోటులేదు. స్త్రీలకు: గృహానందం, ద్రవ్యాదాయం, నూతనావకాశాలుంటాయి.

**మిధునం:-** కొంతకాలంగా కాని పనులు ఈ వారంలో నెరవేరే అవకాశం ఉన్నది. అందుకు తగిన గ్రహస్థితి కూడా ఉన్నది. కొందరు దగ్గరవారి మోసానికి దించటం కూడా ఈవారం గమనింపదగిన విషయం. మీ వాక్చాతుర్యంతో పరాయి వారెవరో తెలుసుకొని పనులు కొనసాగించాలి. స్త్రీలకు: సర్వ విషయాల్లో అభివృద్ధి ఉంటుంది. శుభ కార్యాలోచనలే గాక ధనవ్యయం జరిగే సన్నివేశాలు కూడ ఉన్నాయి.

**కర్కాటకం:-** రచనా వ్యాసంగం, కళారంగాభిరుచి గల వారికి సర్వానుకూల ప్రశస్త వారం. గత వారానికన్నా అన్ని విధాలా మేలైన వారం. సంఘంలో గౌరవం పెరుగుతుంది, కృషి ఫలించి, ప్రగతి మార్గంలో మీరు లాభం గడించడం నిశ్చయం. చేసిన పనే చేయవలసి రావటంతో విసుగు కూడ అధికమవుతుంది. స్త్రీలకు: కొందరకు ఆదాయం, ఉద్యోగంలో ఉన్నతస్థితి సంభవం.

**సింహం:-** ఆలోచనలకు అంతులేదు. అన్నీ కావాలనీ, సమకూడవలెననీ, తాపత్రయం. కాని గ్రహస్థితులనుకూలంగా లేదు. భూ, గృహ సంబంధమైన తగాదాలు రేకెత్తవచ్చు. చికాకులు తొలగకపోవచ్చు. సంఘ గౌరవం లోపించే అవకాశాలుంటాయి. మాటచెల్లుబడి కాలేదను బాధ కూడా వేధిస్తుంది. స్వల్పాదాయముంటుంది. స్త్రీలకు: తలంచిన పనులు సుఖంగా నెరవేరటంతో సంతోషం.

**కన్య:-** శాంతంగా, నిదానంగా, నిబ్బరంగా, నిశ్చయంగా సానుకూలమవుతాయని పనులకు దిగండి. లాభదాయకంగా నెరవేరే అవకాశాలుం

గుర్తుంచుకోండి—

**తల్లి పాలు అన్నిటికన్నా ఉత్తమం**

(ప్రకృతి యిచ్చే యీ వరానికి బదులుగా మరొకటి లేదు.)
అందుకే, వీలైనంత వరకూ పాపకు మీ పాలే
యివ్వండి. అయితే, మీరిచ్చే చనుబాలు గనక
సరిపోకపోతే, అమూల్‌స్ప్రే యివ్వడం మొదలెట్టండి.

**మొదటి నుంచీ అమూల్‌స్ప్రే**
**యివ్వండి—అన్నిటికన్న జనాదరణ**
**పొందిన శిశు ఆహారం**

అమూల్‌స్ప్రేకి దానికి కాగల ప్రత్యేకతలు:
- ఖచ్చితంగా సంతులితమైనది
- విటమినులతో నిండినది
- సులభంగా జీర్ణమౌతుంది
- సులభంగా కరుగుతుంది






# అమూల్‌స్ప్రేతో అభివృద్ధి మొదలౌతుంది
# దానిని బాల్‌అమూల్ పరిపూర్ణం చేస్తుంది






3వ నెల నుంచీ

**బాల్‌అమూల్ కూడా యివ్వండి**
**అత్యంత పుష్టికరమైన,**
**పాలతో కలిసిన సీరియల్ ఆహారం**

3వ నెలనుంచీ, పాప ఎంత వేగంగా పెరుగుతాడంటే, పాప బరువు పుట్టినప్పటికన్నా రెట్టింపు అవుతుంది, మరి 3 ఏళ్ళ కల్లా పాప మెదడు 80% దాకా వృద్ధి చెందుతుంది. అందుకే కేవలం పాలు మాత్రం యిస్తే చాలదు. పాపకు ప్రోటీను, విటమినులు, ఖనిజ పదార్థాలూ ఎక్కువగా, అదీ బాగా సంతులితమైన రూపంలో అందాలి. అవి కేవలం బాల్‌అమూల్‌లోనే అన్నిటికన్న ఉత్తమమైన రూపంలో లభిస్తాయి.

**బాల్‌అమూల్ మన దేశంలోని శిశువుల కోసం ప్రత్యేకంగా తయారైంది.**

బాల్‌అమూల్, సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌వారి సహాయంతో—వెల్లూరు క్రిస్టియన్ మెడికల్ కాలేజివారిచే పరీక్షింపబడినది.

**బాల్‌అమూల్‌లో మరింత పోషణ గల విలువ.**

- ప్రాంతు చేయబడిన యితర మన ఆహారం, సీరియల్ ఆహారాల కంటె కనీసం 25% హెచ్చు ప్రోటీను.
- మరింత హెచ్చు కాల్షియం, విటమిన్ ఎ మరియు డి.
- లావ్య పదార్థాలు, ఇనుము, మరియు విటమిన్ బి కాంప్లెక్స్‌తో యిది పటిష్టం చేయబడినది.
- ముందుగానే పాలతో పండబడినది, తేలికగా అరుగుతుంది, రుచిగలది.
- పప్పు, పండ్ల గుజ్జు, పుడ్డింగ్ మొదలైన వాటితో సులభంగా కలుస్తుంది.

**బాల్‌అమూల్‌తో మీరిచ్చే డబ్బుకు రెట్టింపు విలువ అందుతుంది.**

ASP-AB-5/79

**ఉచితం:** నమూనాలు గల అమూల్ బేబీ బుక్ మరియు బాల్ అమూల్ గ్రోత్ రికార్డ్ బుక్‌లెట్ ఇంగ్లీషులోనూ, అమూల్ బేబీ బుక్ హిందీ, తమిళం, తెలుగు మరియు మళయాళంలో కూడా దొరుకుతుంది. వాటి కోసం పోస్టు బాక్స్ నం 10124, బొంబాయి 400 001 కి, మీ పూర్తి చిరునామాతో బాటు రూ. 1.00 పోస్టేజి స్టాంపులను పంపండి.



విక్రయదారులు: గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్.

టాయి. అనవసర గొడవలకు పోరాదు. ఇరుగు పొరుగు తగాదాలుంటాయేమో! స్త్రీలకు : ఉద్యోగంలో అభివృద్ధి చెప్పవచ్చు. ఆదాయంలో అభివృద్ధి కలదు. ఆరోగ్యం బాగుంటుంది.

**తుల :—** కార్యరంగంలో నిబ్బరంగా దిగండి. ఈ రాశికి అనుకూలమైన వాతావరణం గలదినాలు. కృషి మూలాన మీరు సాధించలేని కార్యాలుండవు. గత వారాని కన్నా వారఫలం లాభదాయకంగా కనిపించటం, వారం మధ్యలో గ్రహింపగలరు. ధనాదయం గలవారం. నూతన మార్గాలలో లాభం సమకూడుతుంది. స్త్రీలకు : పుణ్యకార్యాలు, దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృశ్చికం :—** ఒకదాని తరువాత మరొకటిగా విఘ్నాలుంటాయి. అంతరాయాలకు భయపడకండి లాభం సమకూడే దినాలలో నష్టం రావచ్చు. రాదగిన ధనం చేతికందేదాక అనుమానం వేధిస్తుంది. ఆరోగ్యం సామాన్యం. స్త్రీలకు : శుభకార్యాలోచనలతో గృహకార్యభారంతో, స్వల్పలాభంతో, వారం గడుస్తుంది.

**ధనుస్సు:** వార ప్రథమ భాగం లాభదాయకం. బంధువుల రాకపోకలుంటాయి. పాడిపంటలు సమృద్ధిగా ఉంటాయి. వ్యాపారంలో నిబ్బరంగా, దక్షతతో ప్రవర్తిస్తారు. అందుమూలాన లాభం చిక్కించుకునే అవకాశమున్నదని చెప్పవచ్చు. ఏ పరిస్థితులలోనైనా శాంత ప్రకృతి విడనాడకండి. స్త్రీలకు : సర్వవిధాలా అన్ని రంగాలలోను అనుకూలమైన వారంగా భావించవచ్చు.

**మకరం :—** ఆరోగ్య లోపం కనిపిస్తుంది. వయసుమీరిన వారు మరీ జాగ్రత్తగా ఉండదగిన దినాలు. అజీర్ణవ్యాధికి ఈరాశివారు చాలమంది గురికావచ్చు. గ్రహబలం అవసరం. ద్రవ్యాదాయానికి లోపంరాదు. వ్యయం కూడా అధికమే. ప్రయాణం చేయవలసి వస్తుంది. వాయిదా వేయటం క్షేమం. స్త్రీలకు : ఉద్యోగంలో అవకాశాలుంటాయి. వారాంతంలో మేలు జరుగుతుంది.

**కుంభం :—** వ్యాపార విస్తరణ కార్యక్రమం చాలామంది చేపడుతారు. నక్రమ పద్ధతిలో నడవండి. లాభానికి కొరతయుండదు. చిత్ర రంగానుభవం గలవారికి భారీలాభాలుంటాయి. క్రొత్త అగ్రిమెంట్లు చేయటమో, నూతన వ్యాపారమో ప్రారంభిస్తారు. స్త్రీలకు : మంచివారం. శుభప్రస్తావనలు కార్యాచరణ మవుతుంది.

**మీనం :—** గ్రహానుకూలత కలదు. ఏ పనిచేసినా నిరాశ చెందవలసిన అవసరం లేదు. అనుకున్న విధానానికన్నా, పనులు సాఫీగా జరుగుతాయి. కొందరు ఋణం చేయవలసిన పరిస్థితులుంటాయి. ఆరోగ్య లోపం లేదు. స్త్రీలకు : ముందు ప్రయత్నించి వదలిన పనులు నెరవేర్చుతారు. లాభదాయకమైన వారమే.

**— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి**




# నోటి దుర్వాసనను ఆపండి...
# కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
# దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.

కోల్గేట్ యొక్క సాంద్రమైన చక్కని నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.

ఫలితం : ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుంచి రక్షణ.

ఆయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్నా ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు.




ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మెరైన దంతరక్షణ సమకూర్చగలరు




**నెలకు రు. 1000 సంపాదించండి**

ఫొటోగ్రఫీటీచర్ రు. 6, డ్రాయింగ్ & పెయింటింగ్‌గైడు రు. 10, ట్రాన్సిస్టర్ రేడియోగైడు రు. 10, రేడియో. గైడు రు. 10, వివాహపుజీవితం 100 బొమ్మలతో రు. 8, మెడికల్ సెక్సు గైడు 88 బొమ్మలతో రు. 10, టైలరింగు & కట్టింగు గైడు రు. 8, 300 కుటీర పరిశ్రమల గైడు రు. 15, ఎలక్ట్రిక్ గైడు రు. 10, ఎంబ్రాయిడరీ డిజైన్లు రు. 8, ప్రతి ఒక్కటికి పోస్టేజి రు. 1—50.

**LAXMI BOOK CORNER,**
(M C)-36 Aligarh.

సామాన్యుని సణుగుడు

# ఢిల్లీ డ్రామా చూడర బాబూ !

రాజకీయ పన్నాగాల ఫలితంగా యేర్పడ్డ చరణ్‌సింగ్ ప్రభుత్వం మూడు వారాల మూడు రోజుల ప్రహసనంగా పడిపోవడంతో ఒక నెల రోజుల వ్యవధిలో రెండు ఆపద్ధర్మ ప్రభుత్వాల పరిపాలనకు దేశం గురి ఐంది— మధ్యంతర ఎన్నికలా ? మరోసారి కలగా పులగం గవర్నమెంటా ? అన్న ప్రశ్న రాష్ట్రపతి నుంచి సామాన్యుడిదాకా అందరి మనసులను వ్యాకులపరుస్తున్నది— ఆగస్టు 20వ పార్లమెంటు సమావేశమై ప్రధాన మంత్రి కోసం ఎదురు చూస్తున్న తరుణంలో, చరణ్‌సింగ్‌గారి మోటారు కారు తిరుముఖంపట్టి రాష్ట్రపతి భవనం వైపు పరుగులు తీసింది. జూలై 16న అవిశ్వాస తీర్మానాన్ని ఎదుర్కొనగల ధైర్యం లేక రాజీనామా చేసిన మొరార్జీగారికన్నా— లోక్‌సభలో విశ్వాసాన్ని పొందగల సామర్థ్యంలేని చరణ్‌సింగ్ గారు రెండాకులు యెక్కువ చదువుకొని— ప్రజల దగ్గరికి పోయి మళ్ళీ ప్రధానిగా వచ్చే అవకాశం తమకు కల్పించమని యిది రాజ్యాంగ బద్ధమైన సలహా అని కూడా రాష్ట్రపతిని దబాయించాడు— ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్న పార్లమెంటుకు మరోసారి నిరవధికంగా వాయిదా పడటంకన్నా గత్యంతరం లేకపోయింది !

వ్రతంచెడింది ఫలితం దక్కలేదు.



అత్యవసరంగా మళ్ళీ— రాష్ట్రపతి భవన్‌కి అన్ని రకాల రాజకీయ పక్షాల నాయకుల రాకపోకలు, చర్చలు, బేరాలు, సంప్రదింపులు అన్నీ జులై మూడో వారాన్ని జ్ఞాపకానికి తెస్తూ సంచలనాత్మకంగా ప్రారంభమైనాయి !— "ఆయారామ్‌ల గయారామ్"లదే రాజ్యం !

చరణ్‌సింగ్‌గారు "పడిపోగా"నే 'అయ్యో' అన్నవాడు లేడు. ఆయన ప్రధానిగా సాధించిన ఘనకార్యాలను "ఆహా" అని కీర్తించినవాడూ లేడు… రాజీనామా చేయడానికి ముందుగా ఒక్క క్షణమైనా లోక్‌సభలో ప్రధానమంత్రి "గద్దె" మీద కూర్చునే అవకాశమే పాపం ! ఆయనకి దొరకలేదు—

ఈవిధంగా జన్మ తరింపచేసుకోడానికి— చౌధురీ సాహెబ్ 30 సం.లకు పైగా సుస్థిరంగా వున్న పార్లమెంటరీ వ్యవస్థని సంక్షోభంలో, కల్లోలంలో ముంచెత్తేశారనే దేశంలో అధిక సంఖ్యాకులు భావించారు.

ఇరవైయ్యో తేదీ సూర్యోదయంతోనే "యిందిరమ్మ" చరణ్‌సింగ్ ప్రభుత్వానికి "అస్తమయం" తాఖీదు జారీచేయడంతో— "అత్యల్పకాల" సంకీర్ణ ప్రభుత్వంగా చరణ్‌సింగ్ గవర్నమెంట్ చరిత్ర కెక్కిపోయింది !

"బాబూజీ" యిదే అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు— 205 మంది లేదా 234 మంది (యీ లెక్క కాకుల లెక్కకన్నా కష్టం— ఏ క్షణాన ఎంత వుంటుందో ఎవరు చెప్పగలరు ?) బలం వున్న "నన్ను కూడా ఓ ప్రధానిగా చెయ్యండ"ని రాష్ట్రపతి వద్ద ఆయన గట్టిగా పట్టుబడుతున్నారు.

'మాజీ ప్రధాని' అన్న బిరుదు తప్ప మరేదీ సాధించలేకపోయిన చరణ్‌సింగ్‌గారు "ఇందిరమ్మమీద కేసులు ఉపసంహరించమని— న్యాయపరిరక్షణా దీక్షా కంకణాన్ని వదిలివేయమని" "కాంగ్రె" తన గవర్నమెంట్‌ని "బ్లాక్ మెయిల్" చేసింది కనుక మహత్తరమైన నైతిక విలువల ముందు "క్షుద్రమైన" పదవీ వ్యామోహాన్ని వదలుకున్నామని— ఆదివారం ఉదయం కూడా



"ప్రజలే నిర్ణయించాలి"

18 మంది అన్నా డి. ఎం. కె. ఎంపీల మద్దతుకోసం— యిద్దరు మంత్రుల చేత ప్రమాణ స్వీకారం చేయించిన చౌధురీ సాహెబ్ అన్నారు !

## పాత జ్ఞాపకాలు

ఇట్లా ఆయన అనడంతోనే ఇందిరా కాంగ్రెసు, చవాన్ కాంగ్రెస్‌ల మద్దతుతో చరణ్‌సింగ్ గారు ప్రధాని అవడానికి ముందు పరిస్థితులన్నీ యిప్పుడు మామూలు మనిషి కళ్ళముందు సినిమా రీలులాగా తిరుగుతున్నాయి !

అసలు 1977 లో మొరార్జీ, చరణ్ సింగ్‌లను జనం గెలిపించిందెందుకు ? — ఇందిరమ్మ నియంతృత్వ ధోరణిని అరికట్టడానికి— పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలు గల పార్టీల "కలగా పులగాని"కి అత్యధిక మెజారిటీ యిచ్చిందెందుకు ?— కాంగ్రెస్ పార్టీని గద్దె దించడానికి— కాని, ఈ రెండున్నర సం.ల కాలంలో దేశంలో జరిగిందేమిటి? మొరార్జీగారు, చరణ్‌సింగ్ గారు, జగజ్జీవన్‌రామ్‌గారు ఒకే 'గద్దె' కోసం కాట్లాడుకొని— పార్లమెంటరీ వ్యవస్థ పునాదుల్ని కదిలించి వేశారు…

మొరార్జీని గాని, మొరార్జీమంత్రివర్గాన్ని గాని "కంటినిండా" నిద్రపోనివ్వకుండా, ఒక్కవాడు రాజకీయ తంతాంగం చేసి చౌధురిగారు ఉపప్రధాన మంత్రి ఐనారు— అందుకాయన సరిగ్గా యీనాళ "యిందిరమ్మ" వాడిన "బ్లాకు మెయిల్"

# మధ్యంతర ఎన్నికలు!

**అనుకున్నంతా అయింది! మరోసారి దేశంలో మధ్యంతర ఎన్నికలు జరుగ** నున్నాయి. రాజకీయ నాయకుల కావేశాల ఫలితంగా కేంద్రంలో ఉత్పన్నమైన సంక్షుభిత కల్లోల పరిస్థితిని నిభాయించడానికి గత్యంతరం లేని తరుణంలో రాష్ట్రపతి అన్ని రకాల పార్టీల, గ్రూపుల నాయకులతోనూ, విస్తృత చర్చల అనంతరం— "చౌధురీ చరణ్‌సింగ్ గారి సలహానే" పాటించారు. ఆగస్టు 22 మధ్యాహ్నం పార్లమెంటును అర్ధాంతరంగా రద్దుచేస్తూ తత్కాల ప్రధానిగా చరణ్‌సింగ్‌ను కొనసాగమన్నారు. దేశం నవంబర్‌లో జరగనున్న మధ్యంతర ఎన్నికలకు సిద్ధం అవ్వాల్సి వున్నది— 1977 లో జరిగినవే మధ్యంతర ఎన్నికలు! మళ్ళీ రెండున్నర సం.ల స్వల్పకాలంలోనే లోకసభ జీవితం అర్ధాంతరంగా ముగిసింది.

ఆయుధాన్ని— మద్దతు ఉపసంహరించుకుంటాను అన్న "శిముఖాని." చూపించే పదవిని సాధించారు— అంతేనా— ఎర్రకోట మీద మాట్లాడుతున్నపుడు కూడా ఆయన బి.ఎల్.డి. లీడర్‌గానే మాట్లాడారు. జనతా పార్టీని రెండు ముక్కలు చేసి— ఏ నియంతృత్వ శక్తులకు వ్యతిరేకంగా నిలవమని ప్రజలు తనని

## సామాన్యుని సణుగుడు

ఎన్నుకున్నారో— ఆ 'యిందిరమ్మ' 'చవాన్' పార్టీల పొత్తుతోనే ప్రభుత్వం ఏర్పాటు చేశారు— ఆనాడు "యిందిరమ్మ" "వైకేసు" వరాలు "యిపి" అని అవే యి.పి.కి. చెందిన చరణ్‌సింగ్ గారికి తెలియదా?—

—మధ్యంతర ఎన్నికలు

ఐతే యిందిరమ్మ పార్టీ సహా చాలా పక్షాలనేకం మధ్యంతర ఎన్నికలు కావాలంటున్నాయి. ఈ మధ్యంతర ఎన్నికలు ఐన తర్వాత కూడా— "పార్టీ ఫిరాయింపు దార్లు"గా నవసైతన్యం వచ్చి సుస్థిర ప్రభుత్వానికి తావేర్పడుతుందన్న 'జోస్యం' ఎవరు చెప్పగలరు?— "కప్పల తక్కెడ మేళం" గాక ఒక నియమానికి చట్టానికి కట్టుబడే విధంగా— పార్లమెంటు సభ్యులను శాసించే హక్కు వాళ్ళను పార్లమెంటుకు పంపే 'ప్రజ'లకి కావాలి — కాని ఏలా వస్తుందది?

దేశంలోని అస్థిరత, అధిక ధరల ఒత్తిడి క్రింద, అవినీతి పాలన క్రింద నలిగిపోయే భారతీయులు అర్ధాంతరంగా ముగిసే యీ "పార్లమెంటు" వ్యవహారాల నుంచి గుణపాఠాలు నేర్చుకుని— యిప్పుడు కాకపోయినా 'బాబాజీ' సరదా తీరిన తర్వాతనైన రాగల మధ్యంతర ఎన్నికలో మెలకువతో వ్యవహరించగల "చిరు ఆశ" ఒక్కటే యీ "అస్తవ్యస్త స్థితి గుడ్డిలో మెల్ల."

21-8-'79 — పిరాట్ ★

---

# ధర్మపథం

## గ్రంథం చదివే పద్ధతి

గ్రంథం అనేది వార్తాపత్రికవలె ఒకసారి చదివి మూల పారవేసేది కాదు. కాలక్షేపం కోసం, రైలు ప్రయాణం, బస్సు ప్రయాణం మున్నగు సమయాల్లో చదివే తాత్కాలిక ప్రయోజనకారి అయిన కథలవంటిది గాని, నవలల వంటిది గాని కాదు. అది విజ్ఞానప్రదమైనది. మనకు సందిగ్ధమైన విషయాలు, తెలుసుకోవలసిన విషయాలు ఎన్నో అందులో వుంటాయి. అటువంటి గ్రంథాన్నే మనం చాలా జాగ్రత్తగా చదవవలసి వుంటుంది.

అట్టి గ్రంథాన్ని చదివినప్పుడు మనం, తెలియని విషయాన్ని నేర్చుకోడానికే చదువుతున్నట్టు భావించాలి. అందువల్ల అట్టి గ్రంథ పఠనంలో శ్రద్ధ అవసరం. దానిని చదువుతున్నప్పుడు ఒక పెన్సిలును చేతిలో ఉంచుకోవాలి. మనకు బాగా నచ్చిన అభిప్రాయాలు ఉన్నట్లయితే, ఆ అభిప్రాయాలను వ్యక్తం చేసే వాక్యాల పొడుగునా, జ్ఞాపకార్థం ఆ పెన్సిలుతో గీత గీయాలి. ఆ అభిప్రాయాలు మనకు అనుకూలంగా ఉన్నా, లేక ప్రతికూలంగా ఉన్నా వాటిని గురించి, పేజీకి ఈ ప్రక్క, ఆ ప్రక్క ఉండే మార్జినులో (ఖాళీ స్థలంలో) సంగ్రహంగా ఆ అభిప్రాయాలను పరిశీలిస్తూ క్లుప్తంగా సూచనలు వ్రాసుకోవాలి. గ్రంథం పూర్తిగా చదివిన తర్వాత, తిరిగి మొదటి నుంచీ మార్జినులో వ్రాసుకున్న విషయాలను పరిశీలించాలి. ఆ పరిశీలన— విషయం బాగా జీర్ణం చేసుకున్న తర్వాతనే జరగాలి. ఈ విధంగా మన ఆశయాలను, సంగ్రహించిన విషయాలను స్థిరంగా మనస్సుకు ఎక్కించుకోవడం సాధ్యమవుతుంది.

మన మనస్సు పెద్ద పుస్తక భాండాగారం వంటిది. అది ఉద్గ్రంథాల సారాంశాలన్నీ రూపంలో సంగ్రహంగా ఆ లైబ్రరీలో చేరుతాయి. ఆ లైబ్రరీకి లైబ్రేరియన్ మనమే! అందులో ఎన్ని పుస్తకాలనయినా చేర్చవచ్చు. అక్కడి యీ గ్రంథాలకు గ్రంథ దౌర్బల్యం గాని, గ్రంథ పాతంగాని ఉండదు. మన జీవితకాలమంతా అవి వుంటాయి.

మనం ఎన్నో గ్రంథాలను చదువుతాం. ఎన్నో విషయాలను తెలుసుకొంటాం. వీటినన్నింటినీ ఈ మనో గ్రంథాలయంలో నిక్షిప్తం చెయ్యడం సాధ్యమా? అని సందేహపడనక్కరలేదు. మనస్సు అతి విస్తృతమైనది. ఎన్ని విషయాలను అందులో చేర్చినా, ఇంకా ఖాళీగానే ఉంటుంది. ఆ విషయాలను స్థిరంగా బుద్ధిలో ఉంచుకుంటే ఎంతమంది కయినా అడిగినప్పుడు ఇవ్వడానికి వీలుంటుంది. ఇది మనకూ ఉపయోగమే! మనవల్ల ఇతరులకూ ఉపయోగమే!

*— బులుసు వేంకట రమణయ్య*

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor S Radhakrishna.

# విపుల

## కథాసుమ సౌరభం




ఈనాటి సాహిత్యంలో అగ్ర స్థానం కథానికది. ప్రపంచ వ్యాప్తంగా అనేకానేక భాషలలో కథలు అసంఖ్యాకంగా వెలువడుతున్నాయి. వీటిలో వెల్లివిరిసే వైవిధ్యం అనంతం. ఈ అపురూప కథా సాహిత్యంనుండి ఏరి కూర్చిన ఆణిముత్యాలవంటి కథల జాను తెనుగు అనువాదాలకు వేదిక 'విపుల'.

'విపుల'వంటి పత్రిక తెలుగులోనే కాదు, మరే భారతీయ భాషలోనూ కూడా లేదనేది తెలుగు పాఠకులకే గర్వకారణం.

**విపుల**

'విపుల' ఇంతవరకూ వెలువరించిన 20 సంచికలలోనూ దాదాపు 40 వివిధ భాషలనుండి సేకరించిన 287 అత్యుత్తమ కథలను అందజేసింది. అనువాదం అనుపించనంతటి తేట తెలుగులో ఈ కథలన్నీ పాఠకులను అమితంగా అలరించాయి.

ప్రతి కథకూ రెండు రంగుల ఆకర్షణీయమయిన చిత్రాలు 'విపుల' ప్రత్యేకత. కథలతోపాటు అదనంగా ఎన్నో కార్టూన్లు, జోకులు, విపుల విశ్వ విజ్ఞానం కూడా అందజేస్తోంది విపుల.

రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో వెలువడే **132** పేజీల విపుల వెల కేవలం **125** పైసలే.

*ప్రతి నెలా ఒకటవ తేదీకి వెలువడే విశ్వ కథా విపంచి 'విపుల'*



Marketed By 

**Margadarsi Marketing**
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

Regd No H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

**ఆంగ్ల భాషాబోధక సంస్థ,**
**మొదటి మెయిన్‌రోడ్డు,లేక్ ఏరియా,**
**నుంగంబాక్కం, మద్రాసు 600 034**
**(వళ్లువరుకోటము ప్రక్కన)**

"అదృష్టములో నమ్మకము కలిగి యుండుటయు మరణమును ఎదురు చూచుటయును ఒకటే"

— ఒక జపాను సామెత

చిరకాలముగా, కొన్ని గ్రుడ్డి నమ్మకములు (blind beliefs) మానవుని అభివృద్ధికి ఆటంకముగా ఉండుచూ ఉన్నవి "అదృష్టము వచ్చును" అని వేచి యుండుట, శకునము చూచి పనిచేయుట వంటివి

"అదృష్టము" ఉన్నచో, రాజ కుటుంబములోనే జన్మించి యుండవచ్చునే! ఆంగ్ల రచయిత, ఆలివర్ గోల్డ్‌స్మిత్, "కొందరు నోటిలో వెండి చెంచతోను, కొందరు చెక్క చెంచతోను జన్మింతురు" అనెను అనగా, కొందరు ధన వంతుల ఇళ్ళలోను, కొందరు బీదవారి నివాసములలోను జన్మింతురు సర్వసమైక్యతయే రానిమ్ము! అపుడును అందరును అందలము (Palanquin) ఎక్కుటకు వీలగునా! అందరు ఎక్కినచో దానిని మోయు వారెవరు?

శకునము (OMEN): పిల్లి అడ్డువచుట, విధవ, లేక పురోహితుడు (Lone Priest) ఎదురువచుట, కట్టెలమోపు, క్రొత్తకుండ ఎదురుగా వచ్చుట మొదలగునవి అపశకునములు

మన భారతదేశము ఆంగ్లేయుని చేజిక్కుటకు, మన ప్రజలలో స్థిరపడిన ఇటువంటి గ్రుడ్డి నమ్మకములు కూడ ఒక కారణము

ఒక రాజు ఆంగ్లేయునితో సమరము చేయుటకు సమర భూమికి పోవు సన్నాహము చేయునపుడు, పిల్లి ఒకటి అడ్డు పడెను" "శకునము సరికాదు" అని ఆ రాజు యుద్ధము నకు పోక, "అనవసర బెడదయేల?" అని ఆంగ్లేయుడడి గిన సగము రాజ్యమును అతనికి ఇచ్చివేసెనట

విల్లియం షేక్స్‌పియర్ యొక్క "Macbeth" అను నాటకములో, తన్ను ప్రాణాధికముగా ప్రేమించిన తన భార్యయొక్క ప్రాణము మరణశయ్యలో ఊగిసలాడు చుండగా, మేక్‌బెత్ ప్రభువు, రణరంగమునకు (war front) పోవుటకు కాలు మోపెను అపుడు Seyton అను అధి కారి పరుగెత్తుతూ వచ్చి తెలిపెను, "The Queen my Lord, is dead". (ఓ ప్రభూ, రాణి మరణించిరి) ఈ వార్తను అపశకునముగా తలంచలేదు, అపుడును అతడు ముందు మోపిన కాలును వెనుదీయలేదు

ఇటువంటి Shakespeare సృష్టి చేసిన పాత్ర యైన పరాక్రమ వంతుడైన Macbeth ఎక్కడ? పిల్లికి భయ పడు పిరికి పందయైన మన భారతదేశ మాజీరాజు ఎక్కడ? —పోల్చి చూడదగునా?

నేనడుగుచున్నాను: ఒకతె "విధవ" అయినచో అది నేరమా? లేక ప్రకృతి యొక్క కోపమా? భగవంతుని సేవకు తమ్మర్పించుకొనిన పురోహితులు ఎట్లు అపశకున మగు దురు? కట్టెలు, కుండ లేనిచో పొట్టకు భోజనము లభించునా ఇవన్నియు అపశకునములట! ఎంత మతి విహీనత!!

ఒకపుడు నేను "గణిత" పరీక్షకు పోవునపుడు, విధ వలు ఎదురు పడిరి కాని, నేను నూటికి నూరు తెచ్చు కొంటిని ఇంకను అది నాకు వీడని తలంపు కావున, శకునమనునది అర్థములేని వాగుడు

అదృష్టము, శకునము, గ్రుడ్డి నమ్మకములు వంటి మూఢ నమ్మకములన్నియు మాసిపోవలెను.

తపాలాద్వారా చదివిన అర్థము కాదట ఇట్లొక గ్రుడ్డి తలంపు! నేరుగా వచ్చి తరగతులలో చదివియు, కొందరు "సున్న (0)" తెచ్చుకొనుచున్నారే, దీనికేమి యర్థము?

చదువునకు కావలసినవి: ఆత్మ విశ్వాసము, ఓర్పు, సాధించగల శక్తి సామర్థ్యములు, పరిశ్రమ.

ఈ విద్యా సంస్థలో తపాలాద్వారా "ఆంగ్ల భాషా శిక్షణ" ఆత్మ విశ్వాసము నిచ్చుటతో స్వయముగా ఇంకను అభివృద్ధి చేసికొనుటకు దారితీయును

...UNDARAM

ARE ONE AND THE SAME

16 ఏండ్ల వయస్సునకు పైబడినవారు

**ఒకే సంవత్సరములో ఆంగ్లములో సంభాషించుటకును, పరిచయముచేసికొనుటకును తపాలా ద్వారా**

విశ్రాంతి సమయములో

ప్రారంభమునుండి కాని - లక్ష్యలక్షణ పరిశోధన పద్ధతిలోకాని

**ఇంగ్లీషు**

నేర్చుకోవచ్చును.

ప్రారంభించు క్రొత్త తరగతులగూర్చి నేరుగా వచ్చికాని, 25 పైసల తపాలాబిళ్లతో లేఖను వ్రాసికాని పూర్తి వివరములను తెలిసికొనండి, వెంటనే చేరండి.

(NR)